*Poolathota Series No. 2*

# KAKATI RUDRADEVA'S THOUSAND PILLARED TEMPLE INSCRIPTION AT ANUMAKONDA

( Dated S. S. 1084—January A. D. 1163. )

*Editor:*—**Vidwan K. A. Sastri.**





page 48

The object of editing this record is threefold :— Firstly to popularise the name of the poet who composed the inscription. Secondly to give a correct reading of the text. And thirdly, to throw proper light on the history of the famous Kakatiya Dynasty.

—*Editor*.



**1934**

***Poolathota Grandhamala***

**HANUMAKONDA (Warangal)**

ఫాలతోట గ్రంథమాలా ప్రచురణములు. ౨.

అచింతేంద్రయతి విరచితమైన

# వేయిస్తంభాలగుడి శాసనము

[ శా. శ. ౧౦౮౪ చిత్రభాను సం॥ మాఘ

శు ౧౩ శనివారము. ]

(చరిత్రాంశమూలానువాదసహితము)

పరిష్కర్తలు :

విద్వాన్ కం. అప్పన్న శాస్త్రిగారు

(ఆంధ్రశాస్త్రి [illegible])



శ్రీ [illegible]

ఫాలతోట గ్రంథమాల

హనుమకొండ. నైజాం.

1934

వెల రు 2-0-0

తే. గు. రా.

శ్రీయుత

దేశపాండ్య గోవిందరావు గారు

(Mr. Govind Row, Despande)



Govind Rao

అచింతేంద్రవర విరచితమైన

# వేయిస్తంభాలగుడిశాసనము

[ శా. శ. ౧౦౮౪ చిత్రభాను సం॥ మాఘ

శు ౧౩ శనివారము. ]

(చరిత్రాంశమూలానువాదసహితము)

పరిష్కర్తలు:

విద్వాన్ కం. అప్పన్న శాస్త్రిగారు

(ఆంధ్రచారిత్ర పరిశోధకమండలి, ఓరుగల్లు)



ప్రకాశకులు

పూలతోఁట గ్రంథమాల

హనుమకొండ, నైజాం.

1934

వెల రు 2-0-0

సర్వస్వామ్యములు
ప్రకాశకునివి

దీని వెల
రెండు రూపాయలు



మొదటి ముద్రణము 500 ప్రతులు

శ్రీ భావసంవత్సర చైత్రశుద్ధ శ్రీరామనవమి
1934



శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రింపబడి

పూలతోఁట గ్రంథమాలా సంపాదకునిచే
ప్రకటితము

# कृतज्ञता

अस्त्युत्तरस्यां दिशि दिव्य भूमौ
द्विजेन्द्र वंशेऽजनि देशपाण्ड्य:
सर्वेश भक्त स्सुविशाल भावो
गोविन्द राण्णाम गुणी गुणज्ञ:  १

सङ्गीत शास्त्रेऽस्य तु सुप्रवेश:
प्रीत श्च सङ्गीत कला कलापै:
प्रागल्भ्य विज्ञान विशेषताभ्याम्
प्राप्नोति कीर्तिं च प्रभुत्व कार्ये।  २

संस्तुत्य भूयो रसिकावतंसम्
तं भूरि सौभाग्य विभूतिमन्तम्
यो याचकानां विविधै: प्रदानै
स्तृप्तिं करो तीह सुधर्मयुक्तै:  ३

तस्मै यशो भूषण भूषिताय
गोविन्दरायाय कृतज्ञतां मे
ग्रन्थस्वरूपेण समर्पयामि
पूज्येन भावेन तदङ्कितेन।  ४

कं. अ. शास्त्री.

To

Mr. Govinda Rao Despande

*Tahsildar. Warangal*

**H. E. H. the Nizam's Government.**

THIS MONOGRAPH

IS

MOST RESPECTFULLY DEDICATED

BY

THE EDITOR.

*

# విషయసూచిక

పుట



## ఛాయాపటముల వివరణ

## దే శ ప ట ము లు



---

## వి జ్ఞా ప న

ఈ 'వేయి స్తంభాలగుడి శాసనము' పూలతోట గ్రంథమాలలో రెండవ గ్రంథము. మొదటి గ్రంథమగు 'మల్లికార్జునరావు' అను నవలను ఇదివఱలో మా చందాదారులు చూచియే యున్నారు.

చిత్రపటముల దిమ్మెలు, దేశపటములు తయారు చేయించుటకు, విషయము సేకరించుటకు, ముద్రణాదికమునకు అయిన మొత్తమును బట్టి దీని కింకను హెచ్చువెల వేయవలసి యున్నను నేటి ఆర్థికసంకటమును బట్టి కొలది వెలయే యేర్పరచినాము. కావున మా చందాదారులు ఈ గ్రంథమును స్వీకరించి ఇంకను ఇట్టి ఉద్గ్రంథములను ప్రకటించుటకు మాకుఁ బ్రోత్సాహము కలిగింపఁగోరుచున్నాము. ఈ శాసనము ప్రకటించుటకు మా కనుమతి యిచ్చిన హైద్రాబాదు ఆర్షవిచారసంఘమువారికి మాకృతజ్ఞత వెల్లడించుచున్నాము. (Vide. L. No. 1215. 2–5–34. of Hyd. Arch. Dept. Hyd. Dn.)

ప్ర కా శ కు లు

**The Eastern gate of Thousand Pillared Temple with the inscription stone pillar to the left**



వేయిస్తంభాలగుడి తూర్పుద్వారము ;
శాసన శిలాస్తంభము ఎడమ ప్రక్కనంగలదు

*Photo by R. S. Iyer.*

The Eastern gate of Thousand Pillared Temple with the inscription stone pillar to the left



వేయిస్తంభాలగుడి తూర్పుద్వారము ;
శాసన శిలాస్తంభము ఎడమ ప్రక్కనగలదు

*Photo by R. S.*

# పీఠిక

తలపెట్టినదన్నో తలకు మించినపని. చేసెడిదన్నో అనుభవముచాలని కృషి. ముందునకుఁ బోయినకొలఁది వెనుకటి దోషములు గోరంతలు కొండంతలై గానవచ్చును. పరిష్కర్త పడవలసిన పాట్లు పడరాని కష్టములు. నివాసస్థలమా చారిత్రికాధారములకు ఖని. ప్రకటింపవలసి వచ్చినపు డిది యూసరక్షేత్ర మనిన పరిహాసము గాదు. పరిశోధన మొదలు పెట్టినది మొదలు పరుగులెత్తుటయే కదా! పరిశోధించి చూచుకొనుటకుఁ బట్టుమని పది గ్రంథములైన లేని తావున నుండి యిట్టి పనికిఁ బూనికొన్నచో, పలుతావులఁ జేరి 'ప్రాథేయ' పడకుండ పని వెళ్లుటెట్లు? ఇట్టి క్లిష్టపరిస్థితులలో గ్రంథప్రకటనకు దొరకొని నప్పు డెన్ని లోపము లుండకుండును? త్రొక్కినదారియే త్రొక్కుట యగుటగూడ తొందఱలంతగా లేకపోయిన వనవచ్చును.

ఇది యిట్లుండనిండు. ఇఁకఁ బ్రత్యక్షముగాఁ జూడఁజాలని కాకతీయాంధ్రుల ప్రాచీనవైభవము పలుగురాళ్లలోఁ బ్రతిధ్వనించు చున్నది. పట్టణములను గోలుపోయి పాడువడిన ప్రాతగుళ్ల నావరించినది కాఁబోలు. శిథిలావశేషమయ్యును, శిల్పిశిల్పచాతుర్యమును జిక్కులేకుండఁగఁ బ్రదర్శింపజేయు శివాలయము లీ నిజాంరాష్ట్రమున లెక్కకు మిక్కిలిగా నున్నవి. అట్టి వానిలో మకుట మనఁ దగిన

దీ వేయి స్తంభాలగుడి. వేయి స్తంభాలగుడి యందున్న యీ శాసనమునకు మేము 'వేయి స్తంభాల గుడి శాసన' మని పేరిడితిమి. దీనిని జరిత్రకారులు రుద్రదేవుని అనుమకొండ శాసనమని పేర్కొనుచున్నారు.

శాసనప్రకటనోద్దేశ్యము :—

ప్రత్యక్షదర్శనమువలనను, పండితుల సహాయమువలనను నీ వేయి స్తంభాలగుడి శాసన శ్లోకములకు సరియైన పాఠములను బ్రకటించి కావ్యపాఠకులీ శాసనమునం గల కాకతీయరాజప్రశస్తిని—నీ కావ్యలేశమును—బఠించు ననుకూలము కలుగఁజేయవలె ననుట మా ప్రథమసంకల్పము.

పలువురు ప్రాచ్యపాశ్చాత్య పరిశోధకులు పరామర్శించి విడిచిన యీ శాసనకవి పేరు పదిమంది యాంధ్రులకైనను బరిచిత మయ్యెనా యని మా శంక! పటుతరకావ్య ప్రబంధములను మఱపించు పండితకవి యీశాసనకవి. పేరు? అచింతేంద్రవరుఁడు. ప్రస్తుతము మాకుఁ దెలిసినంతవఱకుఁ గాకతీయరాజప్రశస్తిని బ్రప్రథమమున గానముచేసిన దీ ప్రబుద్ధుఁడే. పండిత సాంప్రదాయమునకుఁ జెందిన శ్రీరామేశ్వర పండితుని కితఁడు తనయుఁడు. అద్వయామృతయతికి శిష్యుఁడఁట! స్వయముగా యతియునై, పంచమహాశబ్ద, మహామండలేశ్వ రే త్యాది బిరుదాంకితుఁడైన శ్రీమత్కాకతి రుద్రదేవునికిఁ బరమగురు వగుట వలనఁ గూడ మన కీయన కావలసిన వాఁడు. పండితుఁడును, కవియు, యతియు నైనట్టి అచిం

తేంద్రవరుని ప్రతిభావిశేషములం దెలిపెడి యీ శాసనము నకు 'అచింతేంద్రవరీయ' మను కావ్యనామమిడి యింతవఱకు శిలోట్టంకితమై యున్న యీతని దివ్యనామము కాకతీయాంధ్రుల సంతతివారమైన మన మనోఫలకములం జిత్రించుకొను నటుల గలుఁగఁజేయ వలె ననుట మా ద్వితీయ సంకల్పము.

వేలకువేలు వ్యయపరచి, మన నిజాం ప్రభుత్వమువారు పాడుపడిన దానిని బాగుచేయించి యుండ, ప్రతివారు నీ దేవాలయమును దర్శించి తద్విషయమైన చారిత్రికపరిజ్ఞానము ప్రత్యక్షము చేసికొనుటకు బదులు అచ్చటి శిలాశాసనముపైఁ గల లిపినిఁ జూచి, యది యే భాషలో నున్నదియో, యెట్లిది వ్రాసిరో, యెట్లిది మనకుఁ దెలియునో, తెలిసికొనఁబోయిన నే మగుదుమో యను నపాత్రపు శంకలను మాత్రము వెల్లడించెడి యనేకుల కీ శాసనములోని సత్యచరిత్రను దేశీయ భాషలో బ్రకటింపవలె ననుట మా తృతీయసంకల్పము.

చేసిన పని :—

పై మా మూడు సంకల్పముల నెఱవేర్ప నుపక్రమణికయే కాక చరిత్రాంశము లను పేర, శాసన మందుఁ బేర్కొనఁబడిన చారిత్రిక స్త్రీ పురుషుల యొక్కయు, ప్రదేశముల యొక్కయు సంక్షిప్తములయిన వివరణములను [శాసనాధారముల వలన దేలిన యంశములనుబట్టి బలువు రక్కడక్కడ దెలిపిన వానిలోఁ గొన్నిటిని] నిందుఁ జేర్చితిమి. శాసన మూలము ఱాతిపై నున్న దున్న ట్లిచ్చుచు, ఇప్పటి వ్రాత

పద్ధతికిం దెచ్చు తలంపుతోఁ జేసిన సవరణలు వృత్తార్థము ( ) లందును, తాయి శిథిలమైన తావులందుఁ బూర్తికావించిన యక్షరములను, ఆయా శ్లోకములకుఁ జెందిన ఛందోవృత్త ముల పేళ్ల తొలి యక్షరములను, శ్లోకముల సంఖ్యలను, వలయితములందు [ ]ను జేర్చి చూపితిమి. శాసనములను జదువు నలవాటుచేసి కొనఁబోవు నారంభకుల మనం బిడి కొని మే మంత విపులముగా సవరించితిమి.

అటుతరువాత, మూలమునందలి శ్లోకము, ఆశ్లోకము క్రిందనే, శ్లోకము తాతి కేవైపున నెన్నవపఙ్క్తిని నున్నదియో తెలువు సంఖ్యలను, అటుతరువాత దండాన్వయమును నిచ్చుచు వచ్చితిమి. అందందు నవసర మని తోచినప్పు డెల్లను బుట యడుగు భాగమున 'ఫుట్‌నోట్సు' జేర్చుచు వచ్చితిమి.

నిజాంరాష్ట్రమునందలి రాజ్యవిభాగములను దెలువు టకు మండలముల క్రింద విభజింపఁబడిన పట మొకటియు, శాసనకాలమునాఁటికి కాకతీయరుద్రదేవుని రాజ్యవిస్తీర్ణమును గనఁబరచు దక్షిణహిందూదేశపట మొకటియు, నిజాంరాష్ట్ర మున భాషలను బట్టి విభాగింపఁదగిన తెలంగానా, మరా ట్వాడా భాగములను దెలుపుటయే కాక తెలంగానాలోని యప్పటి చారిత్రిక ప్రదేశములను జూపు పట మొకటియు— ఇట్లు, నిజాంరాష్ట్రదేశపటములు రెండును, దక్షిణహిందూదేశ పటముతో గలిపి మొత్తము మూడు పటములను—పాఠకుల సౌకర్యముకొఱకు నిందు జతపరచితిమి.

తదుపరి, వేయి స్తంభాలగుడిశాసనములోని చరిత్రాంశముల కక్కఱకువచ్చు మఱికొన్ని శాసనములను అనుబంధముగాఁ జేర్చితిమి. శాసనములోని విషయములను బున రవలోకనముకుఁ దెచ్చుకొనుట కనుకూలముగా నందున్నట్టి యందలి ముఖ్యపదముల నన్నిటిని నకారాదిగా సమకూర్చిన యనుక్రమణిక గూడ నిచ్చితిమి. అన్నిటికన్న ముఖ్యముగాఁ జారిత్రకగ్రంథమున ఛాయాపటములు లేకుండగఁ జదువవలసి వచ్చునంతటి చాద స్తపు బని చేసినవార మనిపించుకొనకుండునట్లు జక్కని ఛాయాపటములను గొన్ని సంగ్రహించి యిందుఁ గూర్చితిమి. చేయవలసినది లేక చెప్పుకొనవలసిన పొరపాట్లను శుద్ధపత్రమునందు జూపించితిమి.

ముఖ్యసవరణములు:—

శుద్ధపత్రములో నిచ్చినను, బీఠికలోఁ గూడ నెత్తి చూపఁదగిన కొన్ని గొప్ప ప్రమాదముల నీ క్రింద నిచ్చుచున్నాము.

౧. ఉపక్రమణిక మూడవ పుటలో మధ్య పేరాలో మొదటి యారు పఙ్క్తులను నిట్లు చదువుకొనవలెను.

"ఇతనికి ముందు రాజా ధర్మవెంకటఅశ్వారావుగారు తెలుపఁగా బెంగాలు ఏషియాటిక్ సొసైటి జర్నలులో (vol. II-P. P. 901) దీనిని గూర్చి ఆ సొసైటి కార్యదర్శిగారు వ్రాయుచు శాసనకాలమును శా. శ. ౧౦౭౮ అని తెలిపిరనియును, బొంబయి బ్రాంచి రోయల్ ఏషియాటిక్ సొసైటి జర్నలు (vol X-P. P. 46) లో డాక్టరు భావుదాజిగారనువారు దీని విషయమై వ్రాయుచు, శాసనకాలమును శా. శ. ౧౦౮౪ అని ప్రకటించిరనియును ఫ్లీటు పండితుఁడు తెలిపినాఁడు."

౨. వే. గు. శా. పుట ౧౩. మొదటి పఙ్క్తి 'బెంగాలు ఏషియాటిక్ రోయలు సొసైటిలో' అనుదానిని 'బాంబయి బ్రాంచి రోయల్ ఏషియాటికు సొసైటి జర్నలు' అని మార్చుకొనవలయును.

౩. రుద్రదేవుని భార్య అన్నమదేవుల ప్రసక్తి తెచ్చిన స్థలమున (పుట ౨౫) చివర నాలుగు పఙ్క్తులనే కాక మఱియొక పుటలోనికిఁ బ్రాకిన ఆ పేరాయంతయు 'బూర్తిగా విడిచివేయఁ దగిన దనియు' ఈ విషయము నే మరల ప్రసంగించిన ౩౪ వ పుటలోని చివర మూడు పఙ్క్తులలోను మాత్రమే కాక తరువాత పుటలోనికి నడచిన వాక్యాంతము వఱకుఁ గూడ విడిచివేయ దగినదనియుఁ బాఠకులకు విన్నవించు కొనుచున్నాము.

౪. ౩౯ వ పుటలోఁ జివర పఙ్క్తిలో 'ఈ శాసనకాలము శా. శ. ౧౧౪౧-౧౨౧౯-౨౦' అని యున్న దానిని శా. శ. ౧౦౪౧ అనగా ౧౧౧౯-20 అని మార్చుకొనవలెను.]

అరసున్నలు విడిచిన సందర్భములను శుద్ధపత్రములో స్థలసంకోచముచేఁ దెలుప మానితిని. అందునకు బండితులు మన్నింతురుగాక. దేశపటములో 'నది' యనవలసినచోట్ల 'నధి' యని యచ్చుపడినది. ఇట్లే మఱికొన్ని ప్రమాదము లా పటములం దున్న వానిని పాఠకులు సవరించుకొనఁ బ్రార్థితులు.

మా కీ శాసనములోని శ్లోకములను సమన్వయించు కొనుటలో మిక్కిలి సహాయపడిన సంస్కృతపండితులకు మేము మా కృతజ్ఞతఁ దెలుపవలసిదని తెలుపుచు అందు ముఖ్యముగా నీ యిద్దఱినిఁ బేర్కొనకుండ నుండఁజాలము.

(1) బ్రహ్మశ్రీ వేమూరి సీతారామశాస్త్రిలుగారు,
ముక్కిరాలపాడుగ్రామము, పశ్చిమగోదావరిజిల్లా.

(2) శ్రీమాన్ కోయిల కందాళై రంగాచారిగారు,
వరంగల్, నైజాం.

మాకుఁ బరిశోధించుటకుఁ గావలసిన గ్రంథములను రిపోర్టులను తమయొద్ద నున్న వానిని మమ్ము జూడనిచ్చిన శ్రీయుత భావరాజు వెంకటకృష్ణారావుగారికిని, వేయి స్తంభాలగుడి 'హాఫటోనుబ్లాకు' (Halftone block) నీపుస్తకమునందు వేసికొన నెరు విచ్చిన మ. రా. శ్రీ కోకల సీతారామశర్మగారికిని, ఇచ్చటి ఫొటోగ్రాఫరగు మ. రా. శ్రీ చంద్రమాళీశ్వరుగారి యొద్దనుండి ఫొటోలను గొన్ని తెప్పించి యిప్పించిన శ్రీయుత గోవిందరావుగారికిని, హనుమకొండ కోటలోని 'జైనశిల్ప' మను చక్కని ఛాయాపటము నిచ్చిన శ్రీ ఆర్. సుబ్రహ్మణ్య అయ్యరుగారికిని (B.Sc., B.T.) మా ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు సమర్పింపవలసి యున్నది.

మేము సంకల్పించిన యీపనికి నాదరణపూర్వకముగా ధనసహాయము చేసిన శ్రీయుత గోవిందరావు దేశపాండ్యా గారు మాకుఁ గల్పవృక్షముకీతి సహాయపడి యుండనిచో మా యీ గ్రంథము ప్రకటించుటయే దుర్లభ మయ్యెడిది గావున శ్రీ గోవిందరావుగారికి మా సహస్రకృతజ్ఞతాభివందనము లర్పించుచు శ్రీవారికి బరమేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి సదా సంరక్షించుగాక యని వేవిధంబుల బ్రార్థించుచున్నవారము.

దేశపటములను జక్కగా ముద్రించి యిచ్చిన హైద్రాబాదు 'మక్తబె ఇబ్రాహీం పవరు ప్రెస్' వారికిని, మిక్కిలి యోపికతో ఇంతకుముందువలెనే యీ శాసనముద్రణవిషయమందును మిక్కిలి నేర్పుతో ముద్రించి యిచ్చిన సరస్వతీ పవర్ ప్రెస్ ప్రొప్రయిటరు గారైన శ్రీయుత అడ్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికిని మా కృతజ్ఞత వెల్లడిచేయకుండగ నీ పీఠికను ముగింపఁజాలము.

ఈశాసనము పరిష్కరించి ప్రచురించుటకు సహాయపడిన గ్రంథములను, పత్రికలను నీక్రింద నుదహరించి ఆపత్రికాధిపతులకును గ్రంథకర్తలకును మా కృతజ్ఞతను దెలుపుచున్నాము.

1. తెలంగానాశాసనముల సంపుటము ముఖ్యముగా వేయిస్తంభాలగుడిశాసనము (ప్రచురింపఁబడనిది)
2. Journal of Andhra Historical Research Society, (ఆంధ్రేతిహాస పరిశోధక సంఘపత్రికసంచికలు) especially the essay on 'The political History of Kakateeyas' by Mr. M. Ramarow B. A., (hons), B. Ed.
3. సుజాత పత్రికాసంపుటములు.
4. ఆంధ్రులచరిత్ర—II వ భాగము.
5. కళింగ సంచికలోని శ్రీయుత మ॥ సోమశేఖరశర్మగారి "కాకతీయులు ; కళింగము" అను వ్యాసమును.

,6 Epigraphical Reports of Madras Government.
7. South Indian Inscriptions Vol. IV.
8. Epigraphica Indica Vol. IX.
9. Indian Antiquary Vol. XI.
(Monograph Edited by Dr. Fleet.)
10. ఆంధ్రకవుల చరిత్ర I వ భాగము నూతనముద్రణము.
(శ్రీ కం॥ వీ॥ పంతులుగారిది)
11. Hyderabad Archaeological Series No. 3.
ఇతర గ్రంథములు, వ్యాసములును.

ఈ గ్రంథమున—బ్రమాదవశమున నేమి యజ్ఞానవశమున నేమి—దొర్లుట సంభవించిన ప్రమాదములను, లోపములను పండితులైనవారు సదయ హృదయులై వెల్లడించుచో, దగురీతి వారికి మా కృతజ్ఞతను దెలుపుకొని తప్పులయినవానిని సవరించుకొనఁగలమని ఆంధ్ర పాఠకులకు మనవిచేసికొను చున్నాము.

ఇట్లు
పరిష్కర్త
వేయిస్తంభాలగుడిశాసనము.



# ఈ గ్రంథమునందు వాడఁబడిన సాంకేతిక పదములు.



ప=పఙ్క్తి
శ్లో=శ్లోకము
చూ=చూడు
ప. సం=పరిశోధక సంఘము.

ఆ. చ. రెం. భా
ఆం. చ. 2 భాగము } =ఆంధ్రుల చరిత్ర రెండవ భాగము.

ఆం. క. చ. మొ. భా=ఆంధ్రకవుల చరిత్ర మొదటి భాగము.
వె. చో=వెలనాఁటి చోళులు (చూ. దక్షిణ హిందూదేశ పటము)
చేర. దే. చేరదేశము. ,,
కందా. కందారము. ,,
సం=సంపుటము. (పత్రికను చేర్కొనినప్పుడు)

శార్దూ
శా. } —శార్దూల విక్రీడితమ్.

వసం=వసంతతిలకా వృత్తము.
ఆర్యా=ఆర్యా వృత్తము.
తా. పా. తాతిపాఠము=తాతిమీఁద అనుట.
మందా=మందాక్రాంత వృత్తము.
ద. వై.=దక్షిణపు వైపు.
తూ. వై=తూర్పు వైపు.
శా. ప. శాసన పఙ్క్తి.

68 శా. ప. 5_46 అని యున్న దానిలో 68, పుట సంఖ్యగాను, 5_46, మూలములోని శాసన పఙ్క్తిగాను పాఠకులు గుర్తింపవలెను: ఇట్లే అంతటను తెలిసికొనఁ దగు.

**Thousand Pillared Temple; Anumakonda**



అనుమకొండలోని వేయిస్తంభాలగుడి

By courtesy of Mr. K. Sitarama Sarma, Editor of Andhrabhyudaya

# వేయిస్తంభాలగుడిశాసనము



## ఉపక్రమణిక

ఈ శాసనము చెక్కఁబడిన ఱాయి అనుమకొండలోని సహస్ర స్తంభదేవాలయావరణములోఁ దూర్పుద్వారము కడ నెడమచేతి వైపునఁ గలదు. ఈ శిల నాలుఁగు పలకలు గలది. దీనిపైఁ గల యక్షరములు మిక్కిలి స్ఫుటముగా నున్నవి. ఇది యొక ఱాతి పీఠమునకు నిలువుగా నుండు నట్లు బిగింపఁ బడినది. ఈ శాసనశిల-శిఖరము, క్రింది పీఠము, గాక, శిల్పము అక్షరములు గల ఱాతిభాగము-కొలతలు ఈక్రింది విధముగానున్నవి.

మొదటివైపు (పశ్చిమము)

ఎత్తు 6 అ. 9 అం. వెడల్పు 2 అ. 2 అం. అక్షరములు గలభాగము 4 అ. 8 అం. ఎత్తు.

రెండవవైపు (దక్షిణము)

ఎత్తు 6 అ. 9 అం. అక్షరములు గల భాగము 5 అ. వెడల్పు 1 అడుగు.

మూడవవైపు (తూర్పు)

ఎత్తు 6 అ. 9 అం. వెడల్పు 2 అ. 2.5 అం. అక్షరములు శిల్పమునకు రెండువైపుల వ్రాయఁబడి మధ్య కొంత విడువఁబడినది. దానియెత్తు 1 అ. 6 అం. వెడల్పు 1 అ. 10 అం. నుండి 1 అ. 11 అం. వఱకు.

నాల్గవవైపు (ఉత్తరము)

ఎత్తు 6 అ. 9 అం. వెడల్పు 1 అ. 7 అం.

అక్షరములున్నభాగము 1 అ. 10 అం. ఎత్తు. 1 అడుగు వెడల్పు.

పై నాల్గువైపులగల శిల్పము :—

పడమట :—లింగము, పానవట్టము. లింగమునకు ఎడమచెయివైపు సూర్యుఁడు. కుడిప్రక్కన చంద్రుడు. ఆ పానవట్టమునకుఁ గ్రిందిభాగమున

నంది (పడుకొనియున్నది.) ఆ నందికి ఎడమప్రక్కన జేతులు జోడించుకొని వంగి నిలుచుండియున్నది ఒక భక్తుని విగ్రహము కాఁబోలు. అట్టిదే దానిముందు చిన్నది మఱొకటి. కుడిప్రక్కన కామధేనువు. వత్సమును గలవు.

దక్షిణము :—చతుర్బాహుఁడైన గణపతి ఆ విగ్రహమునకు దీక్షముగా నెలుకవాహనము.

తూర్పు:—చతుర్భుజుడైన విష్ణువిగ్రహము. కుడిచేతులందు గదయు శంఖమును. ఎడమచేతియందు చక్రము. మఱొకచేయి (ఎడమవైపు) శిధిలము గావింపఁబడినది. విష్ణువిగ్రహమునకు నొక యిద్దరు ద్వారపాలకులున్నారు.

ఉత్తరము :—చతుర్భుజుడైన విష్ణువు కుడిచేయి యొకటి విఱిగి పోయినది. ఎడమచేయి యొకటి—క్రిందకు—వాల్చియున్నదికూడ—నట్లే శిథిలము గావింపఁబడినది.

శిల్పమున్నచోట్ల ఱాతిస్తంభము శిరోభాగమున కొంచెమెత్తుగాను, వలయముగాను, చెక్కఁబడి యొక శిఖరమును గలిగియున్నది. శిఖరముతో గూడఁ గొలిచిచూచిన నించుమించుగా 7 అ. 7 అం. లనుండి 7 అ. 11 అంగుళముల వఱకుండును.

డాక్టరుఫ్లీటు ఇచ్చిన కొలత లీక్రింద నిచ్చుచున్నాను.

ముందటిభాగము. ఎత్తు 8 అ. వెడల్పు 2 అ. 2 అం. శాసనపఙ్క్తులు 1 నుండి 41 వఱకు.

దక్షిణము :—5 అ. 1 అం × $11\frac{3}{4}$ అం. పఙ్క్తులు 42-89.

తూర్పు :—6 అ. $10\frac{1}{2}$ అం. 2 అ. $2\frac{1}{4}$ అం. పఙ్క్తులు 90-150.

ఉత్తరము :—1 అ. 10 అం. × $11\frac{1}{2}$ అం. పఙ్క్తులు 151-166. శిల్పమును గూర్చి యేమియు నతఁడీయలేదు.

ఈ శాసనము నింగ్లీషులోఁ బ్రచురించిన వారిలోఁ గడపటివాఁడయిన డాక్టరు ఫ్లీటుఅను సుప్రసిద్ధపరిశోధకాగ్రగణ్యుఁడు దీనిని మిక్కిలి

సమర్థతతోఁ జర్చించి దండాన్వయయుక్తముగ ఇండియన్ యాంటిక్వేరి యన్ ౧౧ వ సంపుటములో శాసనప్రతిబింబసహితముగాఁ బ్రకటించియు న్నాఁడు. డాక్టరు ఫ్లీటు అదే పత్రికలో (10 సం. 211 పు. లు) ఏ శాస నమునుగూర్చి సంగ్రహముగా దెల్పియున్నాఁడు.

ఇతనికి ముందు రాజాధర్మ వెంకట ఆళ్వారావుగారు బెంగాలు ఏ షియాటిక్ జర్నలులో (Vol. VII-PP 901) దీనినిగూర్చి వ్రాయుచు ఏ శాసనకాలమును శా. శ 1054 అని తెలిపిరనియును, బెంగాలురోయల్ ఏషియాటిక్ సొసైటీజర్నలు (Vol. X-PP 46) లో శ్రీభావుదాజీగా రనువారు దీని విషయమై వ్రాయుచు దీనికాలమును శా. శ. ౧౦౬౪ అని ప్రకటించిరనియును ఫ్లీటు తెలిపినాఁడు. పై రెండుకాలములు సరియైనవి కావనియు, ఈ శాసనమందున్న యంకెలనుబట్టియు సంవత్సరమును బట్టియు శా. శ. ౧౦౭౪ అని తెలిపినవారిలో డాక్టరు ఫ్లీటే మొట్టమొదటివాఁడని యనుకొనుచున్నాను. శాసన శిలా స్తంభమొక ధ్వజ స్తంభమై యుండునని ఫ్లీటు తలంచుచున్నాఁడు. కాని యది నిజముకాదని తోఁచెడిని. ఇది కేవ లము శాసనముకొఱకు గాను, దేవతాప్రతిష్ఠను దెలుపుడు జేయు నొక శాసన స్తంభమనియే యెంచుచున్నాము. దీనిపైఁ గల యక్షరములు స్ఫుటము గాను జక్కగాను జెక్కఁబడియున్నవి. దక్షిణహిందూదేశ శాసనలిపి నేర్చుకొనఁగోరువారు దీనినిఁ జక్కగాఁ బరిశీలించి చూచిన లిపిజ్ఞానము కొంతవఱకు నలవడును. దీనినిఁబట్టి ముందు వెనుకలకాలముల లిపులను బోల్చి చూచుకొనుట కిది స్థానికులకు మిక్కిలి యుపయోగకరముగా నుండును.

## భా ష, లి పి.

ఈ శాసనమందు వాడినభాష మొదటి యెనిమిది పఙ్క్తులలోఁ దప్పఁ దక్కినదంతయు సంస్కృతశ్లోకమయమై యున్నది. ఇందలి లిపి పంద్రెండవశతాబ్దము నాటిది. దీనినే చాళుక్యలిపి లేక సంధిలిపి యనికూడ నందురు. దీనిలోని యక్షరములు వ్రాయఁబడిన పద్ధతి యించుక గమనింపఁ

దగియున్నది. ఈ శాసనమందు నీ క్రింది యచ్చులు హల్లులతోఁగూడి మాత్ర మేకాక విడిగాఁగూడ నుపయోగింపఁబడినవి.

అ = (* ప. 2, 5, 37, 112, 128, 153, 162).
ఆ = (ప. 143, 144).
ఇ = (ప. 11, 26).
ఈ = (ప. 55, 124).
ఉ = (ప. 68).
ఎ = (ప. 35, 38, 115).
ఓ = (ప. 1).
ఔ = (ప. 132).

ఈ ఇట్లుండక 'ర' వలె వ్రాసి దానిమధ్య నొక అడ్డుగీత గీసినట్లుండును. ఋకార మెచ్చటను వాడియుండలేదు. వట్రువసుడి హ్రస్వరూపము చాలచోట్లుపయోగింపఁబడినది. కాని ౠకారమొక హల్లుతోఁగూడి యొక్కసారే ప్రయోగించినట్లు 108 వ పఙ్క్తివలన దెలియవచ్చుచున్నది. ఏకారమునకు బదులుగా ఎకారము వాడఁబడినది. గుడిదీర్ఘము ( ీ ) ఓత్వము ( ో ) నీ యవలసిన చోట్ల సర్వత్రహ్రస్వమే కానవచ్చును. పడమైపు 31 వ పఙ్క్తిలో ఓత్వమొ ( ో ) క్కచోటనే యెట్లో పడినది. (ఉ. ధార్త్రోల్లసత్,) కాని హల్లున కేత్వమిచ్చి కొమ్మునకు దీర్ఘమిచ్చిన పట్ల దీర్ఘమైన ఓకారము సూచింపఁబడినది.

## హల్లులు.

కకారము కన్నడఅక్షరమువలె గానవచ్చును. ఈ రూపము తాటాకుల గ్రంథములందు సహితము గాననగును. దీనినుండి యేర్పడిన 'క'కార రూపమిప్పటికిని గొందఱు వ్రాయుచున్నారు. చకారముక్రింద వత్తు గీత లేని భకారమువలె వ్రాయఁబడియున్నది కావునను, వత్తక్షరములకు (వర్గ యుక్కులకు) వత్తుగీతనిచ్చు నాచారము లేదు కావునను చ, ఛ, భ అను

* ప అనగా శాసనపఙ్క్తి.

అక్షరము లొక్క రీతిగా నుండును. ఇట్లే ప, ఫ లొక్క రీతిగా నుండును. ఈ శాసనమున ఋకారమెక్కడను వాడియుండలేదు. టకారము పొట్టలో నడ్డుగీతలేని ఉకారవిధమున నుండును. డకారమునకును దకారమునకును గొంచెమే వ్యత్యాసముండును. ణకారము నకారమువలె నారంభమై ఓత్వముతో గూడిననకారమువలె నించుమించుగాఁ 'నొ' వలె నుండును. ధ మాత్ర మిప్పటి 'ద' రీతిగా నుండును. ప, ష, లకుఁ గలభేదము షాకుఁదలకట్టుక్రింద నొకయడ్డుగీతవచ్చి రెండవవైపుతో కుడిప్రక్కను గలియుటయె. షా కట్లు కలియదు. అత్వయుక్తమగు శకారము 'లి' వలె వ్రాసి దానిపైన తలకట్టిచ్చిన నెట్లుండునో యట్లుండును. స యనునది తలకట్టంటని 'గు' వలె గాన నగును. 'హ' యను వర్ణము షా కుడితట్టున నొకవంపుండినట్లుండును. శ, యెడమవైపునకు ద్రిప్పివ్రాసిన 'న' వలె నగపడును. ద్విత్వణకారము వ్రాయవలసినప్పుడు ణకారమునకుఁ గ్రింద నావత్తు ఇయ్యఁబడును. షా వత్తు (ు) వావత్తు (్వ) ఒక్క విధముగా నుండును. అకార, ఈకార, ఊకార, ఋకార, ౠకారములతో గూడియున్నప్పుడు తప్ప దదితరయచ్చులతో గూడియున్న బ, భ లకు భేదము కానరాదు. మ అను నక్షరమునకును 'వు' అనుదానికి నీ శాసన లిపియందేమియు వ్యత్యాసములేదు. 'ప్రాదు ద్రుమః' అనునప్పుడు ప్రాదుర్ద్రుమః అని యొకరు చదివిన నంచు వింత యుండదు.

## ఉభయాక్షరములు.

అఱసున్న వ్రాయవలసినచోట నిండుసున్న గలదు. ఈ శాసనకాలమునాటికి నఱసున్న వాడుకలోనికి రాలేదని తోఁచెడిని. ఇట్టి సందర్భమా శాసనారంభమునఁ గల తెనుఁగు గద్యయందు నేఁటియను నిప్పటివ్రాతకు విరుద్ధముగా 'నేంటి' యను ప్రయోగంబు గాననగును. అట్లేఁ నాఁడు అనుటకు నాండు అనియుఁగలదు. (చూ 6, 7 పఙ్క్తులు.) నిండుసున్న యొక్కొక్కప్పుడక్షరమునకుఁ గుడితట్టునను పై భాగమునను వాడుటయుఁ గొన్నిచోట్ల సరిగానే వ్రాయఁబడుటయుఁ జూడగలము. విసర్గ మవసరము

లేనిచోట లేఖకుని ప్రమాదవశమునఁ గాబోలు నొకసారి వాడఁబడినది. (చూ 23 పఙ్క్తి). నిందుసున్న పఙ్క్తి కారంభమున నుండుట వింతగా నున్నది. (చూ 41 వ పఙ్క్తి).

## సంయుక్తాక్షరములు.

శ్రీయని వ్రాయఁదగినచోట్ల చాలసారులు హ్రస్వముగానే వ్రాయబడినది. కారణమప్పటి వ్రాతలో గుడికిని ఎత్వమునకును దీర్ఘమిచ్చి వ్రాయు నలవాటు లేమియని యనుకొనవలసి వచ్చుచున్నది. దీర్ఘాంతముగా వాడవలసివచ్చినప్పుడది మఱొకవిధముగా నుండుచు వచ్చినది. రకారయుక్తమైన హల్లులన్నియు నించుమించుగా ద్విత్వమై గానవచ్చుచున్నవి. ఉ:-శ్రీవ్విర, చంద్రార్క్కమ, కమ్మరాః: రిపువగ్గ. అని యిట్లె విరివిగా వాడఁబడినది. కాని ర కారయుక్తమైన ష కారమున కట్లుకాలేదు. ఉ :-శకవర్ష ములు (చూ. ప. 6.) ర కారయుక్తమైన ణ కారమునకు ద్విత్వాక్షరముక్రింద ణ కారమునకు బదులు నా వత్తు ( ౣ ) ఉపయోగింపఁబడినది. ఉ. సప్తార్ణ్న వీయం. (చూ. పఙ్క్తి. 6.) ర కారముతో గూడు థ కారమునకు మాత్రము ద్విత్వమిచ్చుచో పైన త కారమును, క్రింద థ కారమును వ్రాయుట సర్వ సామాన్యము గానవచ్చు మఱియొక విశేషము. ఉ. పార్థివః=పార్త్థివః అని ఉండును. (చూ. ప. 119.) ఇట్లే 'బద్ధ' అని వ్రాయవలసినప్పుడు 'బద్ధ' అని పైయక్షరము వర్గయుక్కయిన ధకారమును గ్రింద థకారము నుండుట మనకు మిక్కిలి వింతగా దోపకమానదు. 'ప్రసన్న' అని వ్రాయుటకు బదులుగా ప్రసంన అని లిఖింపఁబడి యుండుటకూడ మరువదగినది కాదు. (చూ. ప. 130). ర కారముతోఁ గూడికొనిన పావత్తు రకారము పైఁగల తలకట్టు దీర్ఘము సూచింపదలచిన యెడల వావత్తు వ్రాసి చూపును. ఉ. కందర్ప అనుచో ర్ప్ప అనియు, 'దర్ప్పాపహం' అని వ్రాయునప్పుడు ర్ప్పా అనియు వ్రాయబడును. వర్గాన్త్యానునాసికములతోఁ గలిపి వ్రాయఁదగిన వర్గాక్షరములకు ముందనునాసికములకు మాఱుగాఁ బూర్ణబిందువు వాడఁబడినది. వర్గాన్త్యానునాసికముతోఁ గలిపి వ్రాయఁ బడిన విధమొకటి రెండుచోట్ల.గాననగును. (చూ. ప. 41.)

ఈ రీతిగాఁ బాఠకులుఁపోల్చి చూచికొన్నచో నప్పటి వ్రాతపద్ధతి తెలిసికొనవచ్చును. జాతిమీద నున్నదియున్నట్లు (గుణింతవిషయమున) వీలయినంతవఱకు వ్రాసి మూలము చూపినాను. కావున నెవరిమట్టునకు వారే యీ విషయమును గమనింపఁగలరని యింతటితో నీ చర్చ విరమించుచున్నాను.

## వ్యా క ర ణ ము, ఛ ం ద స్సు.

'కందూరోదయ' యని సంధిచేసినప్పుడు * మొదటిపదము 'కందూరము' అని యనికొనవలసివచ్చును. కాని కందూరిగోకర్ణదేవ మహారాజులని శాసనములందుఁ గానవచ్చుటచే నది 'కందూరు' అను పదమే యను నిశ్చయింపవలెను. కాగా నిచ్చట 'కందూరూదయ' యని సంధి చేయవలసియుండెను. కాని 'తెలుంగాధీశ' మొదలగు శ్రీనాథాదుల ప్రయోగములవలెనే యిదియు దోషముగలదిగా నెంచఁగూడదని యనుకొనవలెనుగాబోలును. కైరవతి, † అంబుజ తీత్యాది వ్యాకరణ విశేషప్రయోగములతో నొక శ్లోకమును బూర్తిగా నింపివేయుటచే కవిత్వశైలి చదువరులకు వినోదమును బుట్టించునదిగా నగుచున్నది. సంభీషయన్ + శత్రూన్ (చూ. ప. 151) అనుచో సంధిచేయగా సంభీషయంచ్ఛత్రూన్ అని శాసనశిలపైఁ గలదు. దీనినిఁ సంభీషయంశ్ఛత్రూన్ అని యుండవలెనని ఫ్లీటు సవరించినాఁడు. కాని జాతిపాఠము తప్పుగాదని చూపుటకు 'సంభీషయం' అను పదాంతమున నున్న యనుస్వార మనునాసికమునకు మాఱుగాఁ బ్రయోగింప బడిన దని గ్రహింపవలెను. ఇట్లు ప్రయోగించుట యప్పటి వ్రాతపద్ధతి ననుసరించి యని కూడ మన మనుకొన వలయును. ఇట్టి సంధికి నాలుగు రూపములు గాన వచ్చుచున్నవి. 1 శితుక్ అను సూత్రము (8 అ. 3 పా. 31 సూ) 2 శశ్ఛోటీతిసూత్రమును వర్తింపఁజేసినచో,

1 సంభీషయ ఞ్ + ఛత్రూన్ అని కాని

2 సంభీషయ ఞ్ + చ్ఛత్రూన్ అని కాని

---

* చూ. ప. 107. † చూ. ప. 135.

3 సంభీషయ ఇష్ + చ్ శత్రూన్ అని కాని

4 సంభీషయ ఇష్ + శత్రూన్ అని కాని రూపనిష్పత్తియగును గాని డాక్టరు ఫ్లీటిచ్చిన రూపమెట్లేర్పడునో నేను గ్రహింపలేక పోతిని. వ్యాకరణజ్ఞులీ విషయమును గమనింతురుగాక!

'ప్రాతీచ్యాన్తాకటక నికటస్థాయిసీ' యను సమస్తపదమందలి మొదటిపదము తద్ధితరూపము తప్పనియుఁ బ్రతీచ్యయని యుండవలెననియు ఫ్లీటు తెలుపుచున్నాఁడు. అట్లుండినచో ఛందోభంగమగును.

ఈ శాసనమందీ క్రింది వృత్తములు వాడఁబడినవి.

1 * శార్దూలవిక్రీడితము (మ, స, జ, స, త, త, గ గణములు)

1, 2, 4, 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15, 17, 19, 20, 21, 22, 28, 29, 30, 31, 32, 33, 38, 39, 40, 41, 42, 46 శ్లోకములు!

2 వసంతతిలకా వృత్తము (త, భ, జ, జ, గ గ గణములు)

3, 16, 18, 24, 25, 26, 35, 36, 37, 43, 44, 45 శ్లోకములు.

3 ఆర్యావృత్తము 5 శ్లో.
4 అనుష్టుభ్ 27 శ్లో.

} శ్లోకేషష్ఠం గురుజ్ఞేయం సర్వత్రలఘుపంచమం, ద్విచతుః పాదయోర్హ్రస్వం సప్తమందీర్ఘమన్యయోః ॥అనుష్టుభ్॥

5 మాలినీవృత్తము:—34, 47 శ్లో. (న, న, మ, య, యగణములు)

6 మందాక్రాంతా:—48 శ్లో. (మ, భ, న, త, త, గ గ గణములు).

7 స్రగ్ధరా:—శ్లో. 23. (మ, ర, భ, న, య, య, య, గణములు)

8 రథోద్ధతా:—శ్లో. 49. (ర, న, ర, ల, గ, గణములు.)

---

1 * ఈ శ్లోకముల సంఖ్యమూలము ననుసరించి యీయఁబడినది. అర్ధయుక్తముగా నిచ్చినశ్లోకముల సంఖ్య శాసనారంభమున గల తెనుఁగుగద్యతోఁగలిపి లెక్కపెట్టఁబడినది కావున నొకటి యెక్కువగా నుండును.

ఈ శాసనకాలము శాలివాహనశకము ౧౧౮౪ చిత్రభాను సంవత్సర మాఘ శుద్ధ త్రయోదశీ శనివారము అనగా 19 జనవరి క్రీ॥ శ॥ 1163. ఆనాఁడు త్రయోదశీతిథి సూర్యోదయమయినతరువాత 2 గం. 20 నిమిష ములకు నారంభమయ్యెను.

## శా స న క వి.

ఈ శాసనము రచించినకవి అచింతేంద్రవరుఁడను నొక యతీశ్వ రుఁడు. ఇతఁడు తనతండ్రి పేరును, తనగురువు పేరును చేర్చాని శ్రీరుద్ర దేవుని వంశమును వర్ణించుచున్నానని శాసనారంభమున దైవప్రార్థనచేసిన తదుపరి వ్రాసికొనినాఁడు (చూ. శ్లో. 4.) ఇతనినిగూర్చి చరిత్రాంశములను శిష్కక్రింద వ్రాసిన చారిత్రక పురుషులను గూర్చి వ్రాయుసందర్భమునఁ దెలుపుటకై నిచ్చట తెలుపుట మానివేసితిని.

ఇతని కవిత్వము మృదుమధురపదభూయిష్ఠమై విలసిల్లుచున్నది. ఇతనిశైలి వివిధాలంకారయుక్తమై ద్రాక్షాపాకమునం బడి రసికజనమనో రంజకముగా నున్నది. ఇతని కవితారసమొక్కింత చవిజూచినవారలకు మకరందనిష్యంద సందోహంబు భాతి నవనవోన్మేషమై మనోల్లాసమును గలిగింపజేయునదిగా నున్నదనిన నిందెంతమాత్ర మతిశయోక్తిలేదు. ఇతని రచనయందు దీర్ఘసమాసములును, దూరాన్వయమును నచ్చటచ్చట గాన వచ్చినను మొత్తముమీద నితని కవిత్వము మిక్కిలి శ్లాఘనీయమై రసవంతమై యొప్పుచున్నదనినఁ బాఠకులు నాతో నేకీభవించెదరని నమ్ముచున్నాను.

## శాసనవిషయము, సారాంశము.

పడమటవైపునఁగల మొదటి యెనిమిదిపంక్తులలో నున్న తెనుఁగు గద్యయందు శాసనము వ్రాయించిన కాకతీయరుద్రదేవరాజుల బిరుదులు, దేవతాప్రతిష్ఠయుఁ దత్కాలమును దెలుపఁబడినవి. తరువాత మూడుశ్లోక ములలో కాకతిరాజుల రాజముద్రిక చిహ్నమైన యాదివరాహమూర్తి యొక్కయు, గణేశునియొక్కయు, సరస్వతియొక్కయుఁ బ్రార్థనలను

జేసెను. నాల్గవశ్లోకమున శాసనకవి తన్నుగూర్చియుఁ దానువ్రాయఁబోవు విషయమును గూర్చియుఁ దెలిపియున్నాఁడు. అటుపిమ్మట కాకతిరుద్ర దేవుని వంశవర్ణనమున నతని పితామహునియొద్దనుండి యారంభించి రెండు శ్లోకములలో ముగించి, తక్కినయయిదు శ్లోకములలో ప్రోలిరాజును, అతని శత్రురాజుల యోటమియుఁ గవి చక్కఁగా వివరించియున్నాడు. పన్రెండవశ్లోకములో ప్రోలరాజు భార్యయైన ముప్పమను ప్రశంసించి నాఁడు. ౧౩ వ శ్లోకమున రుద్రదేవుని జననము ప్రస్తావించి ౩౧ వ శ్లోక మువరకు అతని శత్రుసంహరణమును, అతని పరాక్రమాతిశయమును, అతఁడు కందూరోదయ చోడమహారాజు కుమార్తెయైన పద్మావతిని వివాహమైన విషయమును గడురమ్యముగా వర్ణించి కవి యంతటితోఁ దృప్తి నొందక యతనిని త్రిమూర్తులతోఁ బోల్చి శ్లేష, ధ్వన్యాలంకారములను గుప్పించి వైచినాడు. ౩౨ శ్లోకమునుండి ౩౮ వ శ్లోకమువఱకు రుద్రదేవుఁడు రాజ్యము చేయుచుండఁగా భూమండలమున నెట్టిస్థితి ప్రబలెనో, వివిధాలంకారములతో నతిశయోక్తిగా వర్ణించినాడు. ముప్పదియొనిమిదవ శ్లోకమున, గవి రుద్రదేవుని సముద్రముతోఁ బోల్చి దానియందుగల లోపమితనియందు లేదు కావున రుద్రదేవునితో స్పర్ధచేయవద్దని సముద్రుని హెచ్చరించినాఁడు. రుద్రదేవుని సృష్టించుటలో బ్రహ్మ యుపయోగించిన ద్రవ్యవిశేషములు లోకోత్తరములును, సుప్రసిద్ధములైనవియు నని కనఁబరచినాఁడు. నలుబదిరెండవ శ్లోకమువఱకల్లే వర్ణించుచు నక్కడనుండి కవి రుద్రదేవునికి అనుమకొండపట్టణము రాజధాని యని తెలిపి దానిని మహత్తరమైన యుపమానాలంకారములతో వర్ణించి, యాపట్టణమున నాకాలమునందు సుందరమైన స్త్రీలున్నారనియు, షడంగయుక్తముగ వేదాభ్యాసముచేయు బ్రాహ్మణోత్తములు కలరనియు, వేశ్యాగృహములయందు జరుగు విటుల సురతోత్సవచేష్టల ననుకరించు పక్షికూజితములు పగలుకూడ మానవులకు మన్మథోద్దీపనకారణము లగుచున్నవనియును బహుచమత్కారముగా నా కవివతంసుండుల్లేఖించియున్నాఁడు. ఇప్పటికి నలుబదియైదు శ్లోకములయినవి. తరువాత రెండుశ్లోకములలో, ఆ పట్టణమందలి పంచ

ధారలనియెడి యశ్వాశ్లేషములను గొనియాడినాఁడు. నలుబదియెనిమిదవ శ్లోకమున శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయరుద్రదేవరాజుల రాజ్యవిస్తీర్ణమును వివరించి చెప్పినాఁడు. నలఁబదితొమ్మిదవదియుఁ గజపతిదియు నగు శ్లోకమున—రథోద్ధతాయను వృత్తమున—రుద్రదేవుఁడు ప్రతిష్ఠించిన దేవతాపూజకొఱకై యిచ్చిన మద్దిచెఱువుల యనియెడి గ్రామదానమును దెలిపినాడు. విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమనెడి యలంకారగ్రంథము వలన రెండవప్రతాపరుద్రుని కీర్తి భరతఖండమంతయు నెట్లు వ్యాపింపచేసినాడో మనమందఱ మెఱింగిన విషయమే. అట్టి కవిత్వసంపద. శిశాసనమునను ఘటింపఁజేసి శాసనకవీశ్వరుఁడైన అచింతేంద్రస్వామి గూడఁదననుదనరాజును ధన్యులగాఁ జేసికొనినాఁడు. దానిప్రచారము తజ్జాతీయం దుద్భవించిన మనయాంధ్రులపై వదలి ఆ పుణ్యాత్ములిద్దఱు దివంగతులైరి.

## డాక్టరు ఫ్లీటు (Dr. Fleet) గారి యభిప్రాయము

డాక్టరు ఫ్లీటు ప్రకటించిన యీ శాసనవిషయములు గల యిండియన్ యాంటిక్వేరియను సంపుటము ౧౧ వది చూచుటకు మాకు మొదట నవకాశము చిక్కక పుస్తకమంతయు సిద్ధమైన తరువాత లభ్యమైనందున వీరియభిప్రాయములను సవిమర్శనగా నిచ్చుటఁ బ్రత్యేకముగాఁ దెలుపవలసివచ్చినది. సాధ్యమైనంతవరకు వీరి సవరణ లాయాసందర్భమునఁ బుటయడుగున నిచ్చుచు గూడవచ్చినాను. అయినను సంతృప్తికరముగా నాపనిచేయుటకై మఱల నిచ్చట చర్చించుచున్నాను.

డాక్టరుగారి కోరికపై హైద్రాబాదు ప్రభుత్వమువారు వెయ్యిస్తంభాలగుడి శాసనము ప్రతిబింబమును దీయించి వీరికిఁబంపిరి. అది దగ్గరపెట్టుకొని ఫ్లీటు, తనయభిప్రాయములను పైనఁ జెప్పఁబడిన పత్రికారాజమునందు వెల్లడిచేసిరి. ఆవ్యాసమునుండి యీ క్రింది సంగతుల నెత్తిచూపుచున్నాను.

ఈ శాసనమందొక చోట కాకతిపోలరాజు ప్రోలెరాజనఁబడుచున్నాఁడని ఫ్లీటుగారు తెలుపుచున్నారు. ఆ సందర్భమిది. 'ప్రోలారాజ

ఇతిప్రసిద్ధినుగమత్ ’ అను నేడవశ్లోకభాగమున ‘ ప్రోలో ’ అను నప్పుడు లాకునోత్వమిచ్చుటలో శాసనము చెక్కినవాడు సాధారణముగా నిచ్చు నట్లోత్వము చివర మిక్కిలి పెద్దవంపు నిచ్చియుండక కొంచెముగా నిచ్చి యున్నాడు. ‘ లే ’ అను వ్రాసిన యితరసందర్భములను బట్టి పోల్చిచూచిన నేత్వమిచ్చు తీరున ఏ ‘ లా ’ కు నేత్వమిచ్చి యుండలేదు. దానిని ప్రత్యక్షముగాఁ జూచునప్పుడీ వ్యత్యాసము స్పష్టముగాఁ గానవచ్చును గావున నది ‘ లో ’ యనియే చదువవలసియుండును. 8 వ శ్లోకమున బేర్కొనఁబడిన తైలపుఁడు పాశ్చాత్యచాళుక్య ప్రథమతైలపుఁడని ‘ రైసు ’ (Rice) పండితుఁడన్నాఁడట. అది సరిగాదనియు నతఁడు మాడవతైలపుఁడనియు ఫ్లీటు సవరించినాడు. దీనినే యందఱొప్పుకొనవలసియున్నది. ౧౦ శ్లోకమున బ్రశంసింపఁబడిన గుండరాజెవరో తనకుఁ దెలియదన్నాఁడు ఫ్లీటు. ఉదయరాజు (చూ: శ్లో. 9.) చోళవంశస్థుఁడనుచున్నాఁడు. జగదేవరాజు పట్టపుం బొచ్చపురవరాధీశ్వరుఁడైన సంతరా రాజులలో నొకఁడని తదితరవివరములతోఁ దెలిపినాడు. ఆ విషయములనే పద్మాక్షిశాసనపరిష్కర్తలగు శ్రీయుత కృష్ణశాస్త్రిగారును, ఆంధ్రులచరిత్రకారులు తమ యాంధ్రుల చరిత్ర 2 భాగములోను వివరముగాఁ దెలిపియున్నారగావున మఱల వానిం జెప్ప టనావశ్యకము. ఈ విషయమై నా యభిప్రాయములు ‘ చరిత్రాంశములను ’ శీర్షిక క్రింద ఆ రాజు పేరెత్తఁబడిన సందర్భమునఁ దెలిపితిని. ‘ పతిహితచరిత ’ యని రుద్రదేవుని బిరుదములలోఁ గానవచ్చు దానిని ఆ రాజు పూర్వులనుండిన వచ్చినదని డాక్టరుగారి యభిప్రాయము. డొమ్మరాజు లేక డోమ అను నాతఁడాదిహైందవజాతికిఁ జెందిన సంఘనాయకుఁడని వారితలంపు. ౧౬ వ శ్లోకమునఁ బేర్కొనఁబడిన భీమరాజెవరో తమకుఁ దెలియదనిరి. అతఁడు గోకర్ణునిఁ జంపుట వాస్తవమనిరి. రుద్రదేవుఁడు తగులబెట్టిన పట్టణాధిపతియైన చోడోదయుఁడు ప్రోలరాజు గోవిందరాజును దొలగించి రాజ్యమిచ్చిన ఉదయ రాజయి యుండునేమో యని తెలిపిరి.

బెంగాలు ఏషియాటిక్ రోయల్ సొసైటిలో భావుదాజిగారీక్రింది శ్లోకము నీక్రింది విధముగా నిచ్చిరట :—

రాజ్యం ప్రాచ్యాంలవణజలధే స్తీర పర్యమస్య
శ్రీశైలాంతం ప్రచరతి సదాదక్షిణాశాం సమగ్రం,
ప్రాతీచ్యాంవాటకనికటస్థాయిని రాజలక్ష్మీం
కావ్యేయ్యాశాతాటవిలసి తామాల్యవంతం ప్రపేదే. (చూ. శ్లో. 48).

'ప్రాతీచ్యా' యను ప్రయోగము తప్పనియు, ప్రతీచ్యా అనియుం డవలెననియు ఫ్లీటు తెలుపుచున్నాఁడని యిదివరకే చెప్పియున్నాను. (చూ. వె. గు. శా పీఠిక వ్యాకరణము ఛంధస్సు అను శీర్షిక క్రింద). మాల్యావంతము మాల్యవాన్ పర్వతమనియు నది యిరుగుపొరుగు దేశమున నుండునది కావలెనని భావుదాజిగారు తెలిపిరట. బెంగాలుజర్నల్ సంపాదకులు బలేశ్వరమునకుఁ బడమటివైపున నున్న మల్యగిరులయి యుండునని వ్రాసిరట. ప్రొఫెసరు మానియర్ విలియమ్సుగారి సంస్కృతనిఘంటువులో నది హిందూదేశము (Proper) న మేరువునకు దక్షిణమున నున్న యొక చిన్నపర్వతమై యుండునను చున్నారట. 'కందూరోదయ చోడవంశవిలసత్తను ఆ వ శ్లోకమునకు నర్థము చెప్పవలసినప్పుడు కాకతిరుద్రదేవుఁడు చోళవంశస్థుఁడని కాని చోళులను జయించెనని కాని యెట్లును జెప్పలేకపోవుచున్నానని ఫ్లీటుగారు తమ సందేహమును వెలిబుచ్చిరి. కందూరూదయ చోడవంశమందు బుట్టిన పద్మ (పద్మావతికి) కు ఆశ్రయభూతుఁడని * యాంధ్రులచరిత్ర కారుఁడు చేసిన యర్థమే సమంజసముగా నున్నది. నేనును దానినే గైకొంటిని. ఫ్లీటుకంటె పూర్వము వ్రాసినవారొకరు 'అనుమకొండ'ను అరుణకుండ యని చదివిరట. శ్రీ భావుదాజిగారు త్రిభువన శ్రీ మల్లదేవ (పఙ్క్తి. 24.) అనుదానిని 'త్రిభువనే శ్రీమల్లదేవయని చదివిరట. రెండవశ్లోకము చతుర్థపాదమునందు ఫ్లీటు 'దంతాంతికాంతాశ్రయః' అనుదానిని దంతామాతికాంతాశ్రయ! యను సంబుద్ధిగా సవరించినాఁడు. కాని యిట్లుచేయుటలో గణము తప్పుచున్నది. చివరనున్న విసర్గ

* ఆంధ్రులచరిత్ర 2 వ భాగము పుట 166.

పోవుటచే నంతమందు గురువుండవలెనను వృత్తనియమమునకు భిన్నమైనది. దంతాంతి అనుదానిని దంతాంతయని మార్చిన నర్థము చక్కగానే పొసగునని యట్లు చేసితిమి. ఎట్లయిన నేదియో యొకసవరణ యిప్పట్లవసరమైనది. 'ఏడ్డోడింభకవత్సలాయనపరో' యను ౧౦ వ శ్లోకభాగము నందలి ప్రథమపదమైన 'ఏడస్' శబ్దమునకుఁ ఏడాయను రూపాంతరమునద్ని కావున దానినైన గ్రహింపవచ్చునను సూచన ఫ్లీటు చేసినాఁడు.

'నతేభక్తః' (పఙ్క్తి. 47.) అను దానిని నతోభక్తః యని ఫ్లీటు సవరించుటయే కాక యా శ్లోకమునకు 'కాముఁడెంతపాటివాడు' నలకూబరుఁడెంతవాఁడు అను నీ రీతిగా నర్థము చెప్పినాఁడు. ఇది సరియైనయర్థము కాదనియు మేము చెప్పినయర్థమే సమంజసముగా నుండునినియు మాకు దోచుచున్నది. 'కులే నహీనో' యను శ్లోకభాగమునకు (చూ. పఙ్క్తి. 62) నర్థము చెప్పఁబోయి డాక్టరు ఫ్లీటు గోకర్ణుఁడు నీచకులపువాఁడను నర్థము వచ్చినట్లు చెప్పినాఁడు. కులమందు హీనుఁడుకాఁడని మేము చెప్పిన యర్థమే బాగుండునని యా సందర్భమును బట్టి తెలిసికొనవచ్చును. 'మేలాపనేయోఽజితః' అని ఫ్లీటు పాఠము. మేలాపనే యోజితః యని మా యన్వయము (చూ. పఙ్క్తి. 89_90.) దృష్ట్వేవయను ఱాతిపాఠమును ఫ్లీటట్లే యుంచి చదివినాఁడు, దృష్ట్వైవా యని మా సవరణ (చూ. శ్లో. 30. ప. 118.) వ్యవహారజన్నో యను ఱాతిపాఠమును నతఁడు 'వ్యవహారజన్మో' యని చదివి దానిని 'వ్యవహారజన్మా' అని యుండవలెనని సవరించినాడు. (చూ. శ్లో. 36. ప 126.) వ్యవహారజమ్ + నోయని పదవిభాగము చేయవలెను.

'మద్దిచెఱువుల నామఖేటకమ్' అను 49 వ శ్లోకభాగమున ఫ్లీటు మట్టిచెఱువుల యని చదివినాఁడు. 'ది' 'టీ' లించుక భేదముతో నొకవిధముగా నీ శాసనకాలమున వ్రాయబడుచుండుటయే దానికిఁ గారణము. అయినను మేము ఱాతిమీద బాగుగ బరిశీలించిచూడగా టీకిని దీకిని చాల భేదము గనిపెట్టగలిగితిమి, టీలోఁ పైకెత్తిపెట్టికొని యున్న నిలువుగీతను

నానుకొని గుడియిచ్చుటయు దీలో నట్టిగీత యుండదుకావున కేవలము గుడియే నచ్చుట కనఁబడి తక్కిన యక్షరభాగము టకారమువలెనే యుండుటయు గాననగు. అదిగాక 'మద్దిచెఱువుతో' సమానార్థకమై మద్దికుంట యను నామము పూర్వమున్నట్లు శాసనములవలన గ్రహింపనగును.‡ 'మట్టిచెరువు' అనుమాట మనకు వింతగాఁ దోపకమానదు.

33 వ శ్లోకమందున్న 'ద్విజేంద్రప్రియః' అను శ్లేషార్థమిచ్చు మాటకు డాక్టరు ఫ్లీటొక పక్షార్థమున, పాములకు రాజయిన అనంతుని కిష్టుఁడైనవాఁ డనుభావము సూచించినాఁడు. గరుత్మంతుని కిష్టుఁడైనవాఁ డని మే మర్థము చెప్పినాము. ఏది సమంజసమైనదో పాఠకులే నిర్ణయింతురుగాక!

25 వ శ్లోకమునందలి 'దుర్యోధనస్య నృపతేరివ' యను వాక్యమునకు డాక్టరుచెప్పిన యర్థమునే మేమును నంగీకరించినాము. అతఁ డాశ్లోకమున కిట్లర్థమిచ్చినాఁడు.

Trembling with fear at his glances as the Pandava Prince Bhima trembled at the glances of Duryodhana and being disquieted in his body he, Bhima absconding with all his possessions etc.

(దుర్యోధనుని చూపులకువలెనే అతని (రుద్రదేవుని) కనుజూపులకు భయముచే వణకుచున్న భీముఁడు విహ్వలాంగుఁడై తనవారితో బారిపోవుచు etc.)

ఈ శాసన శ్లోకములలోకెల్ల మిక్కిలి క్లిష్టతరమైనదియు దూరాన్వయము గలదియునగు 'శ్రీహేరంబ యను రెండవశ్లోకమునకు ఫ్లీటు ఇట్లర్థమిచ్చినాఁడు.

---

‡ చూ. మంథెన తమ్మెకట్టచెఱువు శాసనము అను వ్యాసము. (గోల్కొండ పత్రిక 7 సం. 67 సం.)

"O Sree Heramba, be most graciously disposed to me, thou, who art the asylum of the multitudenous hummings of bees which are attracted by the fragrance poured forth by the cluster of opening buds of Jasmine which mingle with thy pendant tresses and who art the asylum of excessive splendour of that shining tusk, the single prowess of which entirely extinguishes the lustre of the tusk of the elephants of the regions."

దీనికి సరియైన తెనుఁగర్థము మేమిచ్చిన శ్లోకార్థమునకు సరిపోవును గావున ఇంగ్లీషు వాక్యములకుఁ దెనుఁగుఛాయ నీయనైతిమి.

ఇంకను నిట్టివి మఱికొన్ని గలవు. ముఖ్యమైనవి తెలిపినాము. ఫ్లీటు పరిష్కరించి ప్రచురించిన యీ శాసనము ఇండియన్ ఏంటిక్వెరియను సంపుటము ౧౧ నుండి నేను వ్రాసికొన్న నోట్సునుండి నాయీ వ్యాఖ్యానము సిద్ధముచేసితిని గనుక నింగ్లీషునందున్న దానిని వ్రాసికొనుటలో నేమైన తప్పులు దొర్లినవో యేమోయని సందేహముండి మరల సవరింప నవకాశము లేనందున బాఠకులు స్వయముగాఁ డాక్టరు ఫ్లీటు వ్రాసినప్రతి చూచి సంతృప్తి జెందఁగలరని యాశించుచున్నాము.

ప్రమాదవశమున నైన నేమి యజ్ఞానవశమున నైన నేమి నా వ్రాత యందు నేవేని తప్పులు దొర్లినచోఁ బండితులు సానుభూతితోఁ దెలిపిన నుచితరీతిని సవరించుకొందును.

కంభంపాటి అప్పన్న శాస్త్రి.



## రామేశ్వరదీక్షితుఁడు, అచింతేంద్రవరుఁడు.

---

ఈ శాసనమందుఁ జెప్పఁబడిన చారిత్రక స్త్రీ పురుషుల యొక్కయుఁ బ్రదేశముల యొక్కయుఁ బేర్లను, వాని వివరములును దెలుపుచున్నాను.

శ్రీరామేశ్వరదీక్షితుఁడు భారద్వాజసగోత్రుఁడు. శ్రౌతి. కాకతి రుద్రదేవుని శాసనకవియైన అచింతేంద్రవరునికిఁ దండ్రి. ఈ రామేశ్వర

**శ్రీరామేశ్వరదీక్షితుఁడు**

దీక్షితుఁడు రుద్రదేవుని జనకుఁడైన రెండవ ప్రోలరాజునకు గురువనియు, మహేశ్వరగ్రామణి యని పిలుఁవబడెననియు శ్రీయుత మారేమండ రామారావుగారు, అనుమకొండకు నుత్తరముననున్న మాదిరెడ్డి కుంట శాసనమును బట్టి తెలుపుచున్నారు*. ప్రస్తుతము మన కీయనను గూర్చి యింతకన్న నెక్కువ యేమియుఁ దెలియదనవచ్చును.

అచింతేంద్రవరుఁడీ శాసనకవియు, శ్రీరామేశ్వరదీక్షితునికిఁదనయుఁడును అద్వయామృతయతికి శిష్యుఁడును, స్వయముగాయతియునై శ్రీ

**అచింతేంద్రవరుఁడు**

మద్రుద్రదనరేశ్వరుని వంశమును నతని పరాక్రమములను దనయునర్ఘకవితానైపుణ్యముతో వర్ణించినాఁడు. ఈ యన పేరింతవరకు దెల్లడి కాకపోయినను నీ కవిపుంగవునిచే సంతరింపఁబడిన యీ శాసనభాగము నంతటినిఁగలిపి యొక ఖండ కావ్యమని భావించి, దీనికి 'అచింతేంద్రవరీయ' మను నామమిడిన నీయనపే రచిరకాలములో భరతఖండమంతటికిఁ దెలియ రాఁగలదు. ఆంధ్రులును దీనినిఁ బలుమార్లు చదివి యిందలి స్వారస్యమును గ్రహించి కృతార్థులగుదురుగాక! ఈ శాసనమందలి తెనుఁగుగద్యను బట్టి అచింతేంద్రవరుఁ డుభయభాషాప్రవీణుఁడని మనము విశ్వసింపవచ్చును.

---

* (చూ. J. A. H. R.S. Rajahmundry Vol. VII–2 P. ఆంధ్రదేశేతిహాసపరిశోధక సంఘపత్రిక). pg. 217.

ఈయన వ్రాసిన తెనుఁగువచనము సలక్షణమైన జాతీయభాషలో నున్నం దున నీ మహాత్ముఁడాంధ్రభాష మాతృభాషగాఁ గలవాఁడని కూడ సగర్వ ముగాఁ జెప్పుకొనవచ్చును. ఈయన కవిత్వసంపదను వెల్లడించు నొక ప్రత్యేక విమర్శక గ్రంథమును బ్రకటించు తలంపు కలదు గావున నీ విషయ మిచ్చట ప్రసంగింపఁ దొరకొనను.

కాకతీయరుద్రదేవరాజునకుఁ దాతయు రెండవ ప్రోలరాజునకుఁ జనకుఁడును, నగు శ్రీమ త్త్రిభువనమల్ల బేతరాజు, రుద్రదేవుని శాసనమున నీ క్రింది విధముగాఁ బ్రశంసింపఁబడినాఁడు.

శ్రీమ త్త్రిభువనమల్ల బేత రాజు క్రీ. శ. 1079_1115

"కాకతీయవంశమందు, మిక్కిలి బలవంతులైన శత్రురాజుల భార్యలకు విధవత్వమాపాదించుటయందు గురువైన శ్రీమ త్త్రిభువనమల్లుఁడను (నొక) రాజుదయించెను. శ్రీకాకతీయరాజులలో శ్రేష్ఠుఁడును, శత్రురాజుల మనస్సులకుఁ దాపము కలుఁగఁజేయువాఁడును, యోగ్యతకల వానికే ధనము నిచ్చువాఁడును బ్రతిదినము తనభార్యలను సంతోసింపఁజేయు వాఁడును, పతివ్రతలు కాని స్త్రీలను దూషించువాఁడును, శివుని పాద పద్మము లర్చించువాఁడును దిరస్కరింపఁబడిన ప్రభువుకలవాఁడునునై త్రిభు వనశ్రీమల్లదేవుఁడు (త్రిభువనమల్లుఁడు) ప్రకాశించెను.' (శ్లో. ౫, ౬) తిరస్క రింపఁబడిన ప్రభువనగాఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియగు నారవ విక్రమాది త్యుఁడు గావచ్చును. అట్లగుట చేతనే యతనిబిరుదమును బేతరాజు ధరించి నాఁడని పై వాక్యములందు సూచింపఁబడినదని నే నూహించుచున్నాను.

ఇతని శాసనము లింతవఱకు మూఁడు గానవచ్చినవి. ఆ మూఁడును హనుమకొండకు నాలుగైదుమైళ్లలోపలనే దొరికినవి*. ఇతనిశాసనము

* ఒకటి ఖాజీపేట దర్గాశిలా స్తంభమున నున్నది. రెండవది ఖాజీ పేట స్టేషనునకు అనుమకొండనుండి పోవుదారిలో బాటప్రక్క వడ్డేపల్లి చెఱువునొద్ద పాతనాకా సమీపమునఁ బడియున్న ఱాతిమీదనున్నది. మూడవది హనుమకొండకు నుత్తరమున శాలి పొలములోనున్న రాతిగుంతు పైఁగలదఁట. ఆ శాసనప్రతి శ్రీమాన. రా. కవిగారు సంపాదించి 1924 భారతి. 9 సంచికలోఁ బ్రకటించినారు.

**Jain Sculpture on the hill side west to the Padmakshi Temple.**



పద్మాక్షి గుడికి పార్శ్వభాగమున గల గుట్టమీది జైనశిల్పము

## Jain sculpture on the Padmakshi hill



పద్మాక్షిగుడికి గుడితట్టునగల కొండమీది జైనవిగ్రహములు

The W. A. H. R. Society.

లలో నొక్క—దానియందుఁగూడఁ ద్రిభువనమల్లుఁడను బిరుదున్నట్లు చెప్పఁకొనలేము. ఇతనకీ బిరుదున్నట్లు మనకుఁ దెలియఁజేయు మొదటిశాసనము రెండవ ప్రోలరాజుకాలము నాఁటిదగు పద్మాక్షి గుడిముందటి శిలాశాసనము (చూ. ప. వై. పత్రి— 72) పద్మాక్షిగుడి శాసనము (Epig. Indica Vol. 9-256. Pg.) ఆ శాసనమం దితని బిరుదావళి యిట్లు చెప్పఁబడినది. చాళుక్యత్రిభువనమల్లుని విజయరాజ్య ముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధమానమిత్యాది వాక్యముల తరువాత "తత్పాదపద్మోపజీవి. సమధిగతపంచ మహాశబ్దమహామండలేశ్వర నన్మకుండాపురవరేశ్వరం పరమమాహేశ్వరం, పతిహితచరితం, వినయభూషణం శ్రీమన్మహామండలేశ్వర కాకతిబేత భూపాల..." అని ఖాజిపేటకుఁ బోవుదారిలోఁ బడియున్న శాసన మాదించు మించుగా నిట్లే యున్నది. (చూ. సుజాత ౨ సం. ౨ సంచిక).

వైజనదండాధినాథుఁ డొకఁడితనికి మంత్రిగా నుండెను. అతఁడు "కాకతిబేతభూపాలక్రమాగత, తదీయరాజ్యధరనిరూపిత మహామాత్యపదవీవిరాజమాన మానోన్నతప్రభు మంత్రోత్సాహశక్తిత్రయ సంపన్నుఁ"డని పద్మాక్షి గుడిముందటి శాసనమునఁ గలదు. ఆ శాసనపరిష్కర్తలగు కృష్ణశాస్త్రి బి. ఎ. గారీ వైజన మంత్రినిగూర్చిన శాసనభాగము నీ క్రింది విధముగా భాషాంతరీకరించిరి. "who does not extol the minister or the Mandalika Kakati Betha, Vijana—that minister of prodigious fame, who by· (his) immeasurable prowess made amidst the applauses of the world, the renowned king Kakati Betha to successfully visit the feet of the Chalukya Emperor (Chakrin) and to rule by the favour of that Emperor, the Sabbi—one thousand district—in such a way as to attract the attention of the world" గొప్పకీర్తి మంతుండును, అగణితశౌర్యసంపత్తుచేత మిక్కిలి ప్రసిద్ధిఁజెందిన కాకతిబేతరాజును జాళుక్యచక్రవర్తి పాదముల సందర్శించునట్లుచేసి, ఆ చక్రవర్తిదయను సబ్బిసాయిరమండలమును లోకాభిరామముగాఁ బాలించునట్లొనర్చిన వాఁడును, మహామండలేశ్వర కాకతిబేతరాజు ప్రధానియునైన వైజనమంత్రి నెవరు వర్ణింపకుండ నుందురు?"

బేతరాజును బెత్మయనియు, భేతమయ్యలనియుఁ గొన్నిశాసనము లందు వ్రాయఁబడియున్నది. శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు (ఎం. ఏ) ఆ 1924 సం, భారతి 9 సంచికలోఁ బ్రకటించిన బేతరాజు శాసనమున నిట్లున్నది. "శ్రీమాన్వి క్రమచక్రి శ్రీ బద్ధమణ్డలికోత్తమః। ప్రాదాత్ప్రోలేశ్వరాయ దీపమాచంద్రతారకం॥ స్వస్తిషకవర్షంబులు ౧౦౦౧ యగు సిద్ధార్థిసంవత్సర సూర్యగ్రహణంబున శ్రీమన్మహామణ్డలేశ్వర భేతమయ్యలు బేతేశ్వరంబున......త, బ్రోలేశ్వరదేవునకు నందదినియలకు నిత్యం పండ్రెండు మానికలు నేయి యాచంద్రతారకంబుగా బోయనట్లుగా * * *"

విక్రమచక్రియన్న పదమునకుఁ గవిగా రర్థము చెప్పఁబోయి 'విక్రమచక్రియనగాఁ బాశ్చాత్యచాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లుఁడు'ని తెలిపిరి. కాని యిటీవల దొరికిన ఖాజీపేట దర్గాశాసనమున బేతరాజున కా బిరుదువచ్చినక్రమము స్పష్టముగాఁ దెలియఁజేయఁబడినది.

"సూ (సూ) నురస్య పరశూపదవాన్, చోళమాళవమదేభమృగేశః। విక్రమేణభువి విక్రమచక్రి బేతభూపతిరితి ప్రథితోఽభూత్" *

బేతరాజన్మకొండ పురవాటియందు శివపురమనెడి తీర్థమునుద్రవ్వించి తనపేర నక్కడ నొకదేవాలయము స్థాపించెనని పైశాసనమున వ్రాయఁబడియున్నది. ఖాజీపేట స్టేషనునకుఁ బోవుదారిలో గల బేతరాజు శాసనము ప్రకారము. ఇతఁడు తనతండ్రి ప్రోలరాజు పుణ్యమునకు గాను వరుణదేవుని స్థాపించినట్లున్నదని శ్రీయుత మా. రామారావుగారు (M. A. M. R. A. S.) వ్రాయుచున్నారు†.

తెలంగాశాసనములలో నొకటియగు గూడూరిశాసనమున నొక బేతరాజు పేర్కొనఁబడినాఁడు. దానిప్రకారము 'దుర్జయాన్వయసుధాబ్ధి నసేకులు సనిన పిఱుందవెన్నడును సంభవుఁడయ్యె' వానికి నెఱ్ఱభూపతి

* చూ. ఆంధ్రేతిహాస పరిశోధకసంఘపత్రిక సం. 7, 2 భా. పుట. 115 (రాజమండ్రి).

† Do శాసనముల పట్టిక పుట. 116.

యుదయించె. వానికి భీమరాజుపుట్టెను. వానికి మండలిక యోజ్జిన గలిగెను. 'అతణ్డని బొట్టబేత వసుధాధిపుఁజేకొని వానివైరి సుద్ధితమునఁ జంపి' యా కొఅనిదేశమునందు బ్రతిష్ఠసేసెను. వానియంగన గామసాని 'బేతభూవిభునిఁ గాకతివల్లభుఁ జేసి'నట్లుగూడ వ్రాయఁబడియున్నది. ఆశాసనమునశే పల్లవరాయఁడొకఁడు భాస్కరవిభు చక్రవర్తి యొకఁడు నా సందర్భమున బేర్కొనఁబడినారు. "భాస్కరవిభుచక్రవర్తి గని కాకతి నిల్పుట కోటిసేయదే" యన్నవాక్యము నిజముగాఁ గోటిసేయునంతటిదే. కాని యా శాసనము ప్రకటించినగాని దానిఁగూర్చి యేమియు నిదమిద్ధమని తెలుప వీలులేకున్నది. ఇందుఁ బేర్కొనఁబడిన బొట్టబేతవసుధాధిపుడి రెండవబేతరాజగునేమో యన్నయూహ కడమిచ్చుచున్నది. కాకతిబేతరాజె యతఁడయినచో గాకతీయుల ప్రాచీనరాజ్య పాలనాంశములను గూర్చిన విశేషామూల్యవిషయము లెన్నియో బయలువెడలు ననుటకు సందేహముండదు. దీని విలువను శ్రీయుత మారే మండరామారావుగారిదివరకే గుర్తించియున్నారు. శ్రీయుత మా. రామకృష్ణకవిగారు భారతిలో బ్రకటింపఁజేసిన బేతరాజు శాసనకాలము శా. శ. ౧౦౦౧ అని యున్నది * కావునను, రెండవప్రోలరాజు మొదటిశాసనము శా. శ. ౧౦౩౮ అని యున్నది కావునను మనమీ కాకతీయ రెండవబేతరాజు క్రీ.శ. 1079 నుండి క్రీ. శ. 1115 సంవత్సరమువఱకుఁ బాలించినట్లు భావింపవచ్చును.

**కాకతిప్రోలరాజు (క్రీ. శ. 1115-1158?**

కాకతిబేతరాజు కొమారుఁడైన రెండవప్రోలరాజు కాకతీయసామ్రాజ్యమునకు(బునాది) బున్యాది వేసినాఁడని చరిత్రకారు లితనిని మిక్కిలి కొనియాడి యున్నారు. † శాసనములలో నితఁడు పోల. ప్రోలెరాజు, ప్రోడరాజ, పోళరసయను నామాంతరములతోఁ బేర్కొనఁబడినాఁడు. ♦ ఇతని ప్రశంస యనేక శాసనములలోఁ గానవచ్చుచున్నది కాని వానిలో రుద్రదేవుని వెయ్యిస్తంభాల

---

* Vide Ep. coll Pg. 316-1915 A. D.

† ఆంధ్రులచరిత్ర రెండవభాగము. ♦ Ep. Indica 9 సంపుటము పద్మాక్షి శా. 256 పుట.

గుడిశాసనమును, పద్మాక్షిగుడి ముందటిశాసనమును, ఖాజీపేట దర్గాశాసనమును ముఖ్యములైనవి. వానిలోని యంశములిచ్చుటకు ముందుగా నితని శాసనములను, నితనినిగూర్చి ప్రస్తావించిన యితరశాసనములను నిట జేర్కొనవలసియున్నది. ద్రాక్షారామశాసనములలో నొకటి వెలనాటి రెండవ చోడరాజు, ప్రోలరాజును దహించినట్లున్నదని కళింగసంచికలో 'కాకతీయులు, కళింగము'ను వ్యాసములో శ్రీయుత మ. సోమశేఖరశర్మగారు దెలుపుచున్నారు. (చూ. దక్షిణహిందూదేశశాసనముల సం. iv నెం 1242) అందులోఁ 'గాకతిపోలరాజ నిర్దహన' యని కలదఁట.

అందుచేతనే కాఁబోలు ప్రతాపరుద్రచరిత్రలో వ్రాయఁబడినట్లు ప్రోలరాజును రుద్రదేవుఁడు పొరపాటున జంపినట్లు చెప్పినది విశ్వసింపక శ్రీయుత మారేమండ రామారావుగారు వెలనాఁటి చోడునిచే నతఁడు చంపఁబడినట్లూహించుచున్నారు. తెలంగానా శాసనములలో నితనివి మఱికొన్ని యున్నవని తెలియుచున్నది. ఇనుగుర్తి, మాటూరిశాసనము లిందునకు దృష్టాంతరము. హనుమకొండ నుండి ఖాజీపేటకుఁ బోవుదారిలోఁ బడియున్న శాసనమును శ్రీయుత మా. రా. రావుగారు రెండుభాగములుగాఁ జేయుచున్నారు. వానిలో నొకటి యీ ప్రోలరాజు శాసనమనియు, రెండవది రెండవ బేతరాజు శాసనమనియును వారు భావించుచున్నారు. * దాయి యడుగుభాగము శిథిలమైపోయినది. కావున నెట్లును నిర్ణయించుటకు వీలులేనిదయినను, ఖాజీపేట దర్గాశాసనమువలెనే యిదియుఁగూడ నంతయు రెండవబేతరాజు శాసనమయి యుండునని నేనూహించుచున్నాను. రెండవప్రోలరాజు ఇనుంగుఱిలిని వాయువ్యపురము (నందు) జలంధేశ్వర భైరవునిం బ్రతిష్ఠసేయించెననియు, ఇతనిబంటు శ్రీమన్మహాసామంతా బొలబెడ్డ మల్లెనాయకుఁడు స్వస్తి శక వర్షములు ౧౦౭౩ శా (ర్వ) రి సంవత్సర చైత్ర శుద్ధ 3 వడ్డవారమునాండు మల్లేశ్వరదేవరకు మల్లసముద్రమును ద్రవ్వించినట్లు నున్నది. ప్రస్తుతము ప్రకటింపఁబడు రుద్రదేవుని శాసనమునుబట్టి యీ క్రిందివిషయములు తెలియవచ్చుచున్నవి.

---

* చూ. ఆంధ్రేతిహాస ప. సం. పత్రిక సం. 6 భా-2. పుట 122.

ప్రోలరాజు శివపాదపద్మయుగళ ధ్యానామృతానంద భూతుఁడు. శ్రీమత్తైలపదేవచాళుక్యచూడామణిని యుద్ధరంగమున నేనుగుపై నుండఁగఁ బట్టుకొని, అతనియందలి భక్త్యానురాగములచే విడిచిపుచ్చెను (శ్లో. 8) కుంకోరిదేశాధిపతిని గెలిచిన గోవిందరాజును జెఱఁబట్టి తరువాత విడిచి యతని రాజ్యమును, ఉదయరాజను మఱొక భూపాలునికిచ్చి వైచెను. (శ్లో. 9) మంత్రకూట నగరాధిపతియైన గుండరాజితనిచేఁ బట్టుకొనఁబడి తలగొఱిగింపఁబడియు వక్షస్థలమున వరాహాంకముంపఁబడి తుదకుఁ జంపఁ బడెను. (శ్లో. ౧౦) అనేకమండలిక రాజులతో ననుమకొండమీదికి దం డెత్తి వచ్చిన జగద్దేవుఁడను మఱొక శత్రురాజుకూడ ప్రోలరాజు నెదిరింప లేక కింకర్తవ్యతామూఢుఁడై వెడలిపోయెను. (శ్లో. ౧౧) ఇతనికి ముప్ప మయనియెడి పతివ్రతారత్నమైన భార్యయుండెను.

డాక్టరు భండార్కరుగారు తమ దక్కను చరిత్రలోఁ బశ్చిమచా ళుక్యరాజులయిన జగదేకమల్ల (క్రీ. శ. 1138-1150) తైలప (క్రీ. శ. 1150-1165?) రాజుల కాలమున సామంతరాజు లవిధేయులైరనియు, ఆసంగతి కనిపెట్టి కాలచుర్యవంశస్థుఁడును, తైలపదేవుని యుద్ధాంగమంత్రియునగు బిజ్జనుఁడను * మాండలికరాజు చాళుక్యలసింహాసనము లాగుకొనఁ బ్రయ త్నించినప్పుడు అతనితో నీ ప్రోలరాజు కలిసియున్నట్లువ్రాసి యీ రుద్ర దేవునిశాసనమును నుదాహరించుచున్నారు†. ఇంతవఱకు మనకు లభ్యమైన ప్రోలరాజు శాసనములలో మొదటిది క్రీ. శ. 1115 సంవత్సరపుది కావు నను, రుద్రదేవుని శాసనములు క్రీ. శ. 1158 వ సంవత్సరమునకు ముందులే వని పలువురు తెలిపిరి కావుట్టియు ప్రోలరాజు క్రీ. శ. 1115 నుండి క్రీ. శ. 1158 వరకు రాజ్యముచేసినట్లు నిర్ణయింపవలసియున్నను, రుద్రదేవునిభార్య అన్నమదేవులదాన శాసనము శ్రీరాజరాజ విజయరాజ్యము ౨ సంవత్సర మనగా శా. శ. ౧౦౭౦ వ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1148 సంవత్స రకాలము నాటిది ద్రాక్షారామమునగలదని శ్రీయుత మల్లంపల్లి సోమశేఖ

---

* Deccan History by Dr. R. Bhandarkar Pg. 157, 158

† బిజ్జలుఁడనికూడ వ్యవహరింపఁబడు చున్నాడు.

రశర్మగారు కళింగసంచికలో వ్రాయుచున్నారు. * (చూ. కళింగ సంచిక, కాకతీయులు కళింగమను వ్యాసము పుట. 378) కావునఁ బ్రోలరాజు క్రీ. శ. 1115 నుండి క్రీ. శ. 1148 వ సంవత్సరము వఱకుఁ బాలించి యుండవచ్చునని యనుకొనవలసి వచ్చుచున్నది.

రెండవప్రోలరాజు మిక్కిలి పరాక్రమవంతుఁడు. త్రిలింగసామ్రాజ్యసంస్థాపకుఁడు. స్వాతంత్ర్యప్రియుఁడు. తెలుఁగువారి యదృష్టరేఖ యితనియందు స్పష్టీకరింపఁబడినది. శివపూజాధురంధరుఁడని యిదివఱకే మనము తెలిసికొంటిమి. కాకతీయులెన్నటికిని జైనులుకారు. పద్మాక్షి గుడిముందటి శాసన మితనిమంత్రియైన బేతనప్రధానిభార్యయైన మైలమ్మది. ఆ మంత్రియు, మంత్రిభార్యయు జైనులగుట స్పష్టము. కాకతీయరాజులలో గణపతిదేవునికి ముందుగతించిన ప్రభువులందఱును వీరశైవులు కాకపోవుటచే వారు సర్వమతసహనము గలిగి బుద్ధజైన వైదికమతముల నొక్కసమదృష్టితోఁజూచి ప్రజానురంజకులై భూమినేలి దిగంతవిశ్రాంతకీర్తులయిరి. చలమర్తి గండబిరుదమీ ప్రోలరాజునకు మాత్రమేకాక యితని పూర్వీకులను గలదని ఖాజీపేట దర్గాశాసనము వలనఁ దెలియుచున్నది. ఇతనికాలముననే బేతనమంత్రి భార్యయైన మైలమ్మచే హనుమకొండలోని పద్మాక్షీదేవాలయము కట్టింపఁబడెను. దీనికప్పటిపేరు 'కదలలాయబసది.' బసది యనగా జైనదేవాలయమని శ్రీయుత కృష్ణశాస్త్రి (బి. యె.) గారు వ్రాయుచున్నారు. బసదియనుపదము వసతియను పదమునుండి మారినదని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి యభిప్రాయమైనట్లు వారి ఆంధ్రులచరిత్రె రెండవభాగము వలనఁ దెలియుచున్నది. పద్మాక్షీదేవాలయమన్న పేరు దానికెప్పుడు కలిగెనో దురూహ్యము.

పద్మాక్షి గుడిముందటి శాసనకాలము నాఁటికిఁ బశ్చిమచాళుక్య విక్రముఁడు బ్రతికియున్నాఁడు కనుకను, ఇతనికాలము నాఁటి (ప్రోలరాజుకాలము) దయిన యీశాసనమున చాళుక్యసంవత్సరము పేర్కొనుట బట్టియు, రెండవప్రోలరాజు నాఱవవిక్రమాదిత్యునికి సామంతరాజుగా నుండి

* Vide S. I. I. Vol iv No. I005.

యుండవచ్చునని కృష్ణశాస్త్రిగారూహించుచున్నారు. (Epi. gr. Indica Vol 9-256. P. P.) ప్రోలరాజున కయిదుగురు కుమారులుండినట్లు శ్రీ చి. వీరభద్రరావుగారు తెలుపుచున్నారు. అట్లని వ్రాయుటకేమి యాధారముకలదో తెలియకున్నది. ప్రోలరాజునకు గంగాధరుఁడను నొక బ్రాహ్మణమంత్రి యంతఃపురపరిపాలకుఁడుగ నుండెనని కరీంనగరము శాసనమువలనఁ దెలియుచున్నది. గ్రంథవిస్తర భీతిచేత నతనినిగూర్చి యిటనేమియు వ్రాయఁజాలకపోతిని.

తైలపదేవుఁడు. 1150-1162 or 1165 ?

రెండవ ప్రోలరాజుచే బంధింపఁబడి విడిచిపెట్టఁబడిన తైలపుఁడెవ్వరను ప్రశ్నయొకటి పుట్టకమానదు. పాశ్చాత్యచాళుక్య చక్రవర్తులలో ఏ పేరుగలవారు ముగ్గురుగలరు. ఇతఁడు మూఁడవవాఁడని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. కాని వారిలో నొకతైలపుఁడు మఱొకశాఖకు జెందినవాఁడని విశ్వసించినందున డాక్టరు భండార్కారుగా రితనిని రెండవతైలపునిగాఁ బేర్కొనుచున్నారు*. తదితరులితనిని మూఁడవతైలపునిగానె పిలుచుచున్నారు గాన నేను నట్లే యొనరించుచున్నాను. ఈ మూఁడవతైలపునిని నూర్మడితైలపుఁడనిగూడ నందురు. ఇతఁడు సుప్రసిద్ధపాశ్చాత్యచాళుక్య చక్రవర్తియగు నారవవిక్రమాదిత్యునికి మనుమఁడును మూఁడవసోమేశ్వరునికి రెండవకుమారుఁడును, మొదటికుమారుఁడైన జగదేకమల్లునికిఁ దమ్ముఁడుఁనునయి, యన్నయనంతరము క్రీ. శ. 1150 నుండి 1155 వఱకుఁ గళ్యాణమున రాజ్యమేలెను. ఆ కడపటి సంవత్సరమే యితని యుద్ధాంగమంత్రియగు కాలచురి బిజ్జన యితని సింహాసనమును లాగుకొనెను. అంతట నతఁడు మఱల క్రీ. శ. 1157 లో ధార్వాడజిల్లాలోని అన్నిగిరిలో రాజ్యస్థాపన చేసికొనెను. ఆ పట్టణమతని కప్పుడు రాజధానియయ్యెను. ఈ బిజ్జన మఱల తైలపునిమీదికి దండెత్తి వెడలగాఁ దైలపుఁడు మఱికొంత దక్షిణమునకుఁ బాఱిపోయి, వనవాసిలో రాజ్యమును స్థాపించుకొనెను. ఇతని రాజ్యావసాన

* డాక్టరు భండార్కారుగారి దక్కన్ చరిత్ర పుట. 158

కాలము క్రీ. శ. 1165 వ సంవత్సరము. ఈ సంగతులన్నియు డాక్టరు భండార్కారుగారి దక్కను దేశచరిత్రనుండి గ్రహింపఁబడినవి. రుద్రదేవుని శాసనము క్రీ. శ. 1162 కాలమునాటిదయియుండి దానిలో రుద్రదేవుని భయముచేఁ జనిపోయిన తైలపదేవుని రాజ్యము భీమరాజు కొంతకాలమనుభవించినాఁడని కలదుకదా! ఈ సందేహనివృత్తి కొఱకై ఆంధ్రుల చరిత్రకారులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు రుద్రదేవుని శాసనములోఁ జేర్కొనఁబడిన తైలపుఁడు నూర్మడితైలపుఁడు కాక మఱొకఁడై యుండవలె ననుచున్నారు. ఇందలి సత్యనిర్ణయమునకుఁ గావలసిన పరిశోధనాసౌకర్య మింతలో నాకు లభ్యమగునట్లు కానరాక పోవుటచే నీవిషయ మింతటితో విరమించుచున్నాను. రుద్రదేవుని శాసనములోఁ బ్రోలరాజు తైలపునిఁ బట్టుకొని విడిచినట్లున్నది కదా! అదెప్పుడు జరిగియుండవచ్చును? ఇతని యన్నయైన జగదేకమల్లుని రాజ్యకాలము క్రీ. శ. 1138 1150. ఈ జగదేకమల్లుని రాజ్యకాలముననే తైలపదేవుఁడు పట్టుఁబడి యుండవచ్చుననియు, ఇతఁడు తాతగారి కాలమున కుమారతైలపుఁడని పిలువఁబడుచున్నట్లు క్రీ.శ. 1116 సంవత్సర ప్రాంతమున నితఁడు సిందవాడి యేలుచున్నట్లొక శాసనము చూపుచున్నదనియును, కృష్ణశాస్త్రి (బి. యే.) గారు పద్మాక్షిశాసనమును గూర్చి వ్రాసిన సందర్భమునఁ దెలియఁజేసినారు. క్రీ. శ. 1122 కాలమున వరంగల్ తాలూకాలోని నెక్కొండశాసనమున నితఁడు కుమారతైలపుఁడని వ్యవహరింపఁబడినాఁడు. కాకతిరుద్రదేవ మహారాజు రాజ్యారంభకాలము ద్రాక్షారామములోని అన్నమదేవుల దానశాసనమునుబట్టి క్రీ. శ. 1148 వ సంవత్సరమయి యుండుట సత్యమైనచో రెండవప్రోలరాజు తైలపదేవుని బంధించినది అతఁడు రాజ్యమునకు రాకమునుపు యువరాజుగానో సేనాపతిగానో యుండి కుమారతైలపుఁడనిపించుకొనినప్పుడే జరిగియుండెనని తెలుపుటకు రుద్రదేవుని శాసనములోని చాళుక్యచూడామణి యన్న బిరుదాటంకము కలిగించునా? కలిగింపదని నాయూహ. కారణము—కుమారతైలపుఁడు చిన్నతనమునుండి మిక్కిలి పరాక్రమవంతుఁడై రాజ్యమునకు రాకమునుపే రాజప్రతినిధి

గానో లేక సామంతునివలెనో గొంతరాజ్యభాగము నేలినట్లుండుటయే. అయినను నితనిగురించి కొంతపరిశోధన యింకను నవసరమై యున్నది.

కాకతి ప్రోలరాజు రెండవశత్రువయిన గోవిందరాజెవ్వఁడో నిర్ణయింపవలసియున్నది. ఈ గోవిందరాజు పశ్చిమచాళుక్య చక్రివర్తియైన యారవ విక్రమాదిత్యుని సేనాధిపతియైన యనంతపాలునికి మేనల్లుఁడని చరిత్రకారులు నిర్ణయించినారు. ఇతఁడు పరాశరగోత్రజుఁడైన

గోవిందరాజు

కృష్ణరాజునకుఁ బద్మలదేవియందు జన్మించెను. గోవింద దండేశుఁడనియు, గోవిందదండనాయకుఁడనియుఁగూడ నితఁడు వ్యవహరింపఁబడుచుండెను. మహాసామంతాధిపతియైన యీగోవింద దండనాయకుఁడు క్రీ. శ. 1101 లో హనుంగల్, బాసపూర్, నాగరఖండజిల్లా లేలుచున్నట్లు అబ్బులూరిశాసనములోని 58_62 పంక్తులవలనను, క్రీ. శ. 1104 లో నితఁడు వనవాసి యేలుచు వడ్డరావుల సుంకమును ననంతపాలుని యాజ్ఞప్రకారము వసూలుచేసినట్లును ఆ శాసనములోని 75_76 పంక్తులవలనను తెలియుచున్నదని కృష్ణశాస్త్రిగారుద హరించుచున్నారు.* క్రీ. శ. 1120_21, క్రీ. శ. 1123_24 సంవత్సరపు ద్రాక్షారామశాసనముల ప్రకారము వేంగిదేశముపై దండయాత్రవెడలినట్లు తెలియుచున్నది. అప్పుడితఁడు కొండపల్లి నేలుచున్నట్లున్నది. నిజాం రాష్ట్రములోని పోచంచెర్లశాసనము † ప్రకారము క్రీ. శ. 1123 వ సంవత్సరము నం దితఁడు కొండపల్లి రాజ్యము నేలుచున్నట్లుండుట కూడ పైవిషయమును బలపరచుచున్నది. కందనోలి తాలూకాలోని క్రీ. శ. 1126_27 నాఁటి త్రిపురాంతకశాసనము వలన నితఁడు వెంగిపురముదహించినట్లును, వెల్నాటి (రెండవ) గొంకరాజు నోడించినట్లును వెల్లడియగుచున్నది. ‡ వెలనాటికి రాజధానిగా నున్న ధనదుపురమును నాకాలమున

* Vide Ep. Ind. Vol. 9–256 P. P. ఎపిగ్రాఫికా ఇండికాలో పద్మాక్షి శాసనమునుగూర్చి వారు వ్రాసినది. 9 సం. 256. పుట.

† సుజాత 2 వ సం. సం. 3 హైద్రాబాదు.

‡ Epi. Indica Vol. 5–213 P. P. and A. R. 1905–06 40 th para 66 P. P.

వేంగిపురమని చెప్పుచుండిరి కాబోలునని యాంధ్రులచరిత్ర కారులు వ్రాయుచున్నారు. (చూ. ఆ. చ. రెం. భా. 5 ప్ర. 155 పుట.) ఇతఁడు గాక పరాశరగోత్రజుఁడైన గోవిందరాజొకఁడున్నట్లు బెల్గామితాలగుంటె శాసనమువలన గ్రహింపనగు. అయినను మనప్రోలరాజోడించిన గోవింద దండనాయకుని వంశవృక్షమీ క్రిందివిధమున నున్నట్లు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టువలన తెలియుచున్నది.



ఈ గోవిందరాజు రుద్రదేవుని శాసనములలో గండ్రగొడ్డలిచేత మిక్కిలి పరాక్రమవంతుఁడై కంఠోరదేశాధిపతిని సవలీలగా నోడించినట్టి చతురుఁడని సూచింపఁబడినది. ఈ కంఠోరదేశాధిపతి యెవఁడో అతనిదేశ మైన 'కంఠోర' యే ప్రాంతమున నుండెనో చరిత్రకారుల కవగాహనమగు టలేదు. ఇతనిరాజ్యము నూడలాగుకొని ప్రోలరాజు దానిని 'ఉదయరా జను మఱొకనికిచ్చి నట్లీశాసనమునందే కలదు.

**ఉదయరాజు** ఆయుదయరా జెవ్వఁడు ! ఈ ప్రశ్న చరిత్ర పరిశోధకులను బాధించుచునే యున్నది.

ఇతఁడే యుదయచోడుఁడై యుండవచ్చునని కూడ నూహింపఁబడెను. చోడోదయుఁడు, కందూరోదయచోడుఁడు, అను రెండు పేర్లు రుద్రదేవుని శాసనమునఁ గానఁబడుచున్నవి.

**చోడోదయుఁడు** ఉదయచోడుఁడు కులోత్తుంగచోడ గొంక రాజునకు సంబంధుఁడై యుండునని హుల్ట్జ ప్రభువు వ్రాయుచున్నాఁడని కృష్ణశాస్త్రిగారు (బి. యె.) తెలుపుచున్నారు. ఎలియట్సు కలెక్షన్ ఆఫ్ ఇన్స్క్రిప్షన్సును బట్టి యుదయచోడుఁడు గుంటూరునకు రాజయినట్లు శ్రీయుత చి. వీరభద్రరావుగారు తెలుపుచున్నారు* ఈ చోడోదయుఁడే 'కందూరోదయచోడు'ఁ డైనచో అతనికుమార్తె యైన పద్మావతిని రుద్రదేవుఁడు వివాహమాడుట ఉదయచోడుని మరణానంతరమా అంతకుఁబూర్వమేనా యనుశంక పుట్టును. కారణము చోడోదయుఁడు రుద్రదేవుని భయముచే ప్రాణములు విడిచినాఁడని (శ్లో. 17) చెప్పిన తరువాతనే 'కందూరోదయ' చోడవంశజయైన పద్మావతినిఁ బెండ్లాడెనని యీశాసనమునఁ గలదు. (శ్లో. 28) ఈ శంకయిట్లుండగా మన యీ రుద్రదేవుని శాసనకాలముతో సరిపోవు (క్రీ. శ. 1162) నాఁటి ఉదయ

---

* ఇట్లని నా నోటుపుస్తకములలో వ్రాసికొన్నప్పుడు వారు ఎక్కడవ్రాసినారో అరిఫరెన్సు వ్రాసికొనుట మఱచిపోయినాను.

యచోడుని జల్పూర్ల శాసనము నెట్లు సమన్వయింపవలసియున్నదను మఱొక సమస్యబయలు దేరుచున్నది.

ఇట్టిసంశయములే రుద్రదేవునిశాసనమునం బేర్కొనంబడిన భీముండు గోకర్ణుండను నిద్దఱసోదరులను గూర్చి వ్రాయునప్పుడు మనల నెదుర్కొని ఇదమిత్థమని నిర్ణయించుట కాటంకములు కలిగించుచున్నవి.

ప్రోలరాజు గోవిందరాజును దఱిమి ఆరాజ్యము నుదయరాజున కిచ్చినాండని, ఆ ఉదయరాజెవ్వండై యుండునను సమస్యలోంబడి చోడోదయ భీమగోకర్ణులవృత్తాంతముల నెత్తుకొని రుద్రదేవుని కాలమునకు వచ్చి పడితిమి. మనము మఱల వెనుకకుంబోయి ప్రోలరాజు తక్కినశత్రువులెవ్వరో తెలిసికొనవలసి యున్నది.

రెండవ ప్రోలరాజు రెండవశత్రువు మంత్రకూటనగరాధిపుండైన గుండరాజొకండు కలండు. ఇతనికే మంధన్యగుండాధిపుడన్న వ్యవహారము కలదని పాలంపేట * శాసనమువలనం దెలియుచున్నది. ఇతండు నిజాంరాష్ట్రములోని కరీంనగరము మండలములోని మంథెనరాజధానిగా నా ప్రదేశము నేలుచుండెను. ఇతనికి నాగరాజను మంత్రికలండని యొకరు వ్రాయుచున్నారు. ఇతనిని, రేచర్లరుద్రిచమూపతి పితామహుండును, రెండవప్రోలరాజు సేనాపతియునైన కామచమూపతి చంపినట్లు పాలంపేటశాసనమునం గలదు. (శ్లో. 15) కాని రుద్రదేవుని శాసనమున నితనిని బ్రోలరాజు చంపినట్లున్నది. సేనాపతులు చంపినను నా గొప్పందనము వారిప్రభువులు చెప్పికొనుట యప్పటి యాచారమేమో?

మంధన్యగుండాధిపుండు

ప్రోలరాజు శత్రువులలో ప్రబలుండైనట్టియు, తక్కిన శత్రురాజులకు నాయకుండైనట్టియు జగద్దేవుండను నొకరాజు ప్రోలరాజుచే నోడింపంబడినట్లిదివరకే చెప్పియున్నాను. ఆ జగద్దేవుండెవ్వడో యించుకంత నిక్కడచర్చించెదను.

---

* Hyd. Arch. Series No. 3. 15th Verse.

పశ్చిమచాళుక్యుల సార్వభౌమాధిపత్యమును ధిక్కరించి స్వతంత్రుఁడుకాఁ జూచిన కాకతిప్రోలరాజు (రెండవ)ను శిక్షించుటకుఁ జాళుక్యరాజులపక్షమున నితఁడు వచ్చియుండవచ్చునని కొంద ఱూహించుచున్నారు. జగద్దేవుఁడు 'పట్టిపొంబుచ్చపురాధీశులగు సంతారరాజులలో నొకఁడగు మహామండలేశ్వర త్రిభువనమల్ల జగద్దేవుఁడే యని మ. రా. శ్రీ కృష్ణశాస్త్రిగారును', * శ్రీయుత చి. వీరభద్రరావుగారును గూడ నభిప్రాయపడుచున్నారు. † ఈ విషయమై చి. వీరభద్రరావుగారు వ్రాసినది గమనింపఁ దగియున్నది. దాని నిక్కడ నిచ్చుట చర్వితచర్వణమనిపించుకొనుననియు గ్రంథవిస్తరభీతిచేతను దాని నిక్కడ నుదహరింపలేదు.

జగద్దేవుఁడు

నిజాం రాష్ట్రమునందలి కరీంనగరమండలములోని లేంబాలవాడ (లేములవాడ) భీమేశ్వరుని గుడియందలి శా. శ. ౧౦౩౧ వ సంవత్సరపు నాటి శాసనమున నొక జగద్దేవుఁడు పేర్కొనఁబడినాఁడు. అందతనికిఁ గల బిరుదులిట్లున్నవి. "స్వస్తిశ్రీ లేంబాలవాడసమా(?) వాసోసమస్తప్రశస్తోపేతసమధిగత పంచమహాశబ్దాద్యలంకారాద్యలంక్రి (కృ) తః శ్రీమహామండలేశ్వరం వా (శ) వాక (స) కులతికలకః శ్రీజగద్దేవర......" అని తెలంగానా శాసనములలో నొకటియగు నగునూరి కన్నడశాసనమున (క్రీ.శ. 1143 కావచ్చును) దొమ్మెరాజు మేడ రజులతోఁబాటు జగదేవుఁడొకఁడు ప్రసంగింపఁబడినాఁడు. వరంగల్ జిల్లాలోని మాటూరి గ్రామశాసనమునఁ గూడ 'జగద్దేవు' అనుమాటలు కానవచ్చుచున్నవి. ఇవన్నియుఁ బరిశీలించి చూడఁగా నీ జగద్దేవుఁడు లేంబాలవాడ (లేములవాడ) ప్రాంతపువాఁడై యుండునేమో యని నా కనుమానమగుచున్నది. ఈ జగద్దేవుఁడు ప్రోలరాజునకు మిక్కిలి పరాక్రమశాలియైన శత్రువే కాని సామాన్యుఁడు కాఁడు కావుననే యితనిని గెలిచినఁ బ్రోలరాజు శౌర్యాతిశయము వలనఁ గలిగిన గౌరవము నేమని వర్ణింతునని రుద్రదేవుని శాసనకవి తెలుపుచున్నాఁడు.

---

* Epig. Indica Vol ix-256 P. P.

† ఆంధ్రులచరిత్ర. రెం. భా. 167, 168 పుటలు.

ప్రోలరాజు భార్యయైన ముప్పమ్మనుగూర్చిన చారిత్రకాంశములేమి యు రుద్రదేవుని శాసనమందుఁగాని మఱెచ్చటను గాని చెప్పఁబడలేదు.

ముప్పమ్మదేవి

ఈమెకును ప్రోలరాజునకును బుట్టినవాఁడే మన వెయ్యిస్తంభాలగుడిశాసన కర్తయు, మొదటి ప్రతాపరుద్రుఁడని చరిత్రకారులచే వ్యవహరింపఁబడిన వాఁడును నగు కాకతిరుద్రదేవమహారాజు. ముప్పమ యే దేశపురాజు కుమార్తె? ఆమె కెంతమంది పిల్లలుబుట్టిరి? మున్నగుప్రశ్న లన్నియు నిరుత్తరములై యుండవలసివచ్చుట మిక్కిలి శోచనీయమయిన సంగతి.

శ్రీమన్మహామండలేశ్వర కాకతీయరుద్రదేవరాజు, రెండవ ప్రోలరాజు తరువాత, ననుమకొండ రాజ్యమును బాలించుటకు సింహాసన మధిష్ఠించెను.

కాకతి రుద్రదేవరాజు.

ప్రోలరా జెంతవఱకు రాజ్యము చేసియుం డెనో స్పష్టముగాఁ జెప్పుట కాధారములింత వఱకును దొరకలేదు. కాని రుద్రదేవునిశాస నములలో మొట్టమొదటిదని చెప్పఁబడు క్రీ. శ. 1158 వ సంవత్సరపు నాఁటిదగు ద్రాక్షారామశాసనమం దిట్లున్నది. "స్వస్తిశ్రీ (మత్) త్రిభువన మల్లచక్రవ(ర్తి) రాజరాజదేవర విజయరాజ్య సంవత్సరంబులు ౧౩ శాకా బ్దంబులు ౧౦౮౦ గు నేణ్డిమీనమాసమున శుద్ధ పంచ్చాదశియు బ(బృ)హస్పతివార మునాణ్డు శ్రీమద్ద్రాక్షారామమున శ్రీభీమేశ్వరమహాదేవరకు అన్మకొండ రుద్ర దేవని ప్రగ్గడ ఇనంగల బ్రమ్మిరెడ్డిపెట్టిన అఖ(ణ్డ) లోహదణ్డు(దివియ) ౧......" (చూ. S. I. I. Vol. IV. No. 1107-371 P. P. దక్షిణ హిం. దే. శా. సంపుటము 4-పుట. 371.); కాబట్టి యీకాలమువరకుఁ బ్రోల రాజేలినట్లును, ఇప్పటినుండి రుద్రదేవరాజు రాజ్యముచేసినట్లును శ్రీయుత్ మా. రామారావుగారు మొదలయినవారు కొందఱు వ్రాయుచున్నారు కాని ఇంతకుముందు తెలిపినట్లు రుద్రదేవునిభార్య అన్నమదేవులు ద్రాక్షా రామమునందలి భీమేశ్వరునికి దీపదానముచేసినట్లున్న యచ్చటిశాసనమున రాజరాజదేవర 2(3) వ సంవత్సరమున్నది. కావున దీనిప్రకారము శా. శ.

౧౦౭౦ కు సరియైన క్రీ.శ. 1148 వ సంవత్సరము నాఁటికే రుద్రదేవుఁడు రాజ్యమునకువచ్చినట్లు నిర్ణయింపవలసియుండును. అంతియేకాని యాంధ్రులచరిత్ర రెండవభాగములోఁ జెప్పఁబడినట్లు రుద్రదేవుని రాజ్యారంభకాలము క్రీ. శ. 1140 అని తెలుపుట నిరాధారముకాదా? ఇట్లే యితని రాజ్యావసానకాలము క్రీ, శ. 1195 అని చరిత్రకారులు తెలుపుచున్నారు. కాని నర్సారావుపేట తాలూకాలోని కుంకలగుంట గ్రామములోని భోగేశ్వరాలయములోని శాసనమును * బట్టి శా. శ. ౧౧౧౯ అనగా క్రీ. శ. 1197 వ సంవత్సరమే రుద్రదేవుని రాజ్యావసానకాల మనవలసివచ్చునేమో యని సందేహపడుచున్నాను. దీనిని జరిత్రకారులెక్కువ విమర్శనగాఁ బరిశీలింపగలరు గాక !

రుద్రదేవుని శాసనము ద్రాక్షారామమున మఱొకటికలదు. అది శా. శ. ౧౧౦౮=క్రీ. శ. 1186 వ నాఁటిది. అందులోనున్నవని తెలిపెడు విద్యాభూషణయను మాటలు వినయభూషణయని చదువవలసియున్నది. (చూ. దక్షిణహిం. దే. శా. సంపు. IV నెం. 1155).

రుద్రదేవుని యనుమకొండ శాసనమందు డొమ్మరాజును, మేడరాజును మైలిగిదేవుని రుద్రుఁడోడించి వారిరాజ్యములు తనరాజ్యమందుఁ గలిపికొనినట్లు సూచింపఁబడినది (శ్లో. 15, 16, 17, 18).

రుద్రదేవుని శత్రురాజగు డొమ్మరాజు (దొమ్మరాజు) ఎచ్చటివాఁడో కొంత తెలిసికొనవలసియున్నది. ఇతనిపేరు రుద్రదేవుని శాసనములో

**డొమ్మరాజు**

డొమ్మరాజని వ్రాయఁబడినట్లు శాసనము పరిశీలనగా జూచినవారికి దెలియఁగలదు కాని యీ శాసనలిపిలో 'దా' కును 'డా' కును నించుకంతమాత్రమే భేదము గోచరించును.

కనుక యితనిపేరును నితరశాసనములను బట్టి నిర్ణయింపవలసివచ్చును. అదినాకు సాధ్యపడలేదు. ఇతనినిగూర్చి శ్రీయుత మారేమండ

---

* చూ. బొల్లయప్రెగ్గడ కుంకలకుంట గ్రామశాసనము భోగేశ్వరాలయము. Ref. List of Antiquaries by Sewell.

రామారావుగారు ఇతఁడు ధర్మపురి వేములవాడ (లేములవాడ) ప్రాంతము నేలుచు భద్రాచలమువరకు విస్తీర్ణముగల ప్రదేశము నేలినట్లున్నదని వ్రాయుచున్నారు. (చూ. వారి 'పొలిటికల్ హిస్టరీ ఆఫ్ కాకతీయాస్' (Political History of Kakateayas in J. A. H. R. S. Vol. V. 3 P.) నిజాం రాష్ట్రమునఁ గానబడిన నగునూరి శిలాశాసనములో నొక దొమ్మరాజు పేర్కొనఁబడినాఁడు. అందిట్లు వ్రాయఁబడియున్నది. "స్వస్తిశ (స) మస్తప్రశస్తసహితం శ్రీమనుమహామండలేశ్వరం దొమ్మరాజు, శ్రీమచ్చాళుక్య విక్రమగాద ఉత్తమవిస్వనాళ్కనెద్దె ప్రమాదిసంవత్సరద వైసక బహుళచది వెలుపుయమగు సు(శు)క్రవారమునాండు మేడరాజు జగదేవుడుం ఎనభయి వేలుతో పొడిచి గెలిచె." ఈ శాసనమున తెలుఁగు కన్నడ భాషలు కలిసి యుండుట విచిత్రముగా నున్నది. మూలము చూచి సరిచేసికొనవలసియున్నది కూడ భావిపరిశోధనమునఁ గాని యితఁడెవరో తెలిసికొన వీలులేదు.

**మేడరాజు**

రుద్రదేవుని మఱొక శత్రురాజును సందర్శింతము. మేడరాజును రుద్రదేవుఁడు జయించెనని యీ శాసనమందే కలదుకదా (శ్లో. 16). నిజాం రాష్ట్రమునం దనేకశాసనములను సంగ్రహించి ప్రసిద్ధిచెందిన సుప్రసిద్ధచారిత్ర పరిశోధకులిట్లు వ్రాయుచున్నారు. "ఇతఁడుఁ (మేడరాజు) ప్రోలరాజుకాలమున యువకుఁడుగనుండి పాకాల తాలూకాలోని కురువట్ట మొదలుకొని గోదావరివఱకుఁ గలదేశమును బరిపాలించుచుండెను. పాఖాలతాలూకాలోని గోవిందపురములో నితనిమంత్రియగు నాగదేవరాజు పార్శ్వజినేశ్వరాలయము నిర్మించి తనవంశమును జెప్పుకొనియున్నాఁడు. మేడరాజు జైన మతాభిమాని. మాధవవర్మవంశమున జన్మించినవాఁడు. ఈ వీరుఁడు కాకతీయసామ్రాజ్యమును లెక్కింపక చాలకాలము స్వతంత్రుఁడుగానుండి వారకృములో రుద్రదేవునిచే నోడింపఁబడినటుల గొన్నియాధారములచే (?) నిశ్చయింపవచ్చును..." *

* నిజాం రాష్ట్రప్రశంస పుట. 104 (1926 సం.)

తెలంగానాశాసనములు చూచిన మ. రా. శ్రీ మా. రామారావు గారును గొంతవరకు వీరితో నేకీభవించుచున్నారు. అయినను నాశాసనములు ప్రచురించిన తరువాతగాఁని దానిసత్యమును నిర్ణయించుటకు వీలు లేదని మా నమ్మకము. ఈ మేడరాజే హనుమకొండలో పద్మాక్షిగుడిముందర శాసనమున (క్రీ. శ. 1117) మాధవవర్మవంశజుఁడైన మేళరసుఁడను పేరుతోఁ జేర్కొనఁబడినాఁడని మా యూహ. ఇతనిపేరు నగునూరి శాసనమునఁగూడఁ బ్రసంగింపఁబడి నట్టిదివరకు దొమ్మెరాజును గురించి తెలిపిన శాసనములో జూపఁబడినది.

రుద్రదేవుఁడో డించిన రెండవశత్రురాజు మైళిగిదేవుఁడనువాఁడు. మైళిగదేవుఁడెవరో యింతవరకుఁ జరిత్రపరిశోధకులకు సరియైన సంగతి తెలియలేదు. ఇతఁడు దేవగిరినేలిన యాదవ రాజులలో నొకఁడగు మల్లుగి (సింగనరాజు కొడుకు) యైనను లేక యతనికొమారుఁడైన యమరమల్లుగియైనను గావచ్చునని శ్రీ వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రలో (రెం. భా. 163 పుట) వ్రాసినారు. శ్రీయుత మా. రామారావుగారు వీరితో నేకీభవించుటలేదు. మైళిగదేవునిజయించి పొలవాసదేశవిభవమును రుద్రుఁడు పొందెనని (శ్లో. 15) యీ శాసనములోనే గలదు కావునను, రుద్రదేవుని శత్రురాజులందఱు అనుమకొండచుట్టుపట్లప్రదేశము నేలినవారే కాబట్టియు, పైనఁచెప్పఁబడిన పొలవాస పట్టణమునకు నిప్పటిపేరు కాఁదగిన పొలాసగ్రామము కరీంనగరమండలములోని జగత్యాలతాలూకాలో జేరినది కనుకను, అతఁడుతప్పక నిజాం రాష్ట్రప్రాంతవాసుఁడయి యుండవచ్చును.

వీరిపైకి మాత్రమేగాక భీమరాజను గొప్ప బలపరాక్రమములుగల శత్రురాజుమీదికి సహితము రుద్రదేవుఁడు మిక్కిలి యట్టహాసముతో దండెత్తి వెళ్లవలసివచ్చినది. అట్లతనిమీదికి దండెత్తివెళ్లి రుద్రదేవనరపతి భీమరాజు రాజధానియైన వర్ధమాననగరమును మొట్టమొదట కాల్చివేసెను. (శ్లో. 25) ఇతనిమీద నింతపగఁబట్టి రుద్రదేవుఁడితనిపై దండెత్తి వెడలుట

శాక కొన్ని కారణములీ శాసనమందుఁ జెప్పఁబడినవి. గోకర్ణుఁడను సర్పము భీముఁడనెడి నకులముచే (గొప్పచీకటియం దెలుక పిల్లి పిల్లచే (శ్లో. 16) జంప బడినట్లు, జంపఁబడెనట. రుద్రదేవునిఁ భయముచేఁజచ్చిన తైలపునిరాజ్యము భీముఁడు క్షణకాలమనుభవించెనఁట. (శ్లో. 18) నక్కపిల్ల సింహముతో స్పర్ధించినట్లు, నరపశువును, సవతితల్లికిఁ బెనిమిటియైనవాఁడును, భోజనము చేయుచుండగాఁ సోదరుని జంపినవాఁడును నగు భీమన్ృపాధముఁడు రుద్ర దేవునితో స్పర్ధఁబెట్టుకొనినాఁడఁట. (శ్లో. 20) ఇటువంటి దుశ్చేష్టలెన్ని యో భీమరాజు చేయుచున్నట్లు రుద్రదేవరాజు తనచారులవలన విని గొప్ప సేనను సమకూర్చుకొని యతనిమీదికి యుద్ధమునకు వెళ్లినట్లున్నది. ఈ భీమ రాజునుగూర్చి కొంతప్రస్తావించెదను.

రుద్రదేవుని శాసనములోఁ జెప్పఁబడినట్లు భోజనసమయమున తనసోద రునిఁజంపి సవతితల్లినిఁ బెండ్లాడినట్టియు, తైలపుఁడు మరణింపఁగా నతని

భీమరాజు

రాజ్యపదవిని క్షణకాలమనుభవించినట్టియు రుద్రదేవుఁడు దండెత్తి వెడలినప్పు డతనికి భయపడి భ్రాతృమాతృవనితాసహితుఁడై య డవికిఁ బారిపోయినట్టియు, భీమరాజే భీమచోడుఁడనియు, వర్ధమానపు రమేలు చుండెననియు మనమూహింపవలసియున్నది. ఇతనికి నుదయాది త్యుఁడను నన్నయు, గోకర్ణుఁడను తమ్ముఁడును గలరు. క్రీ. శ. 1125 వ సంవత్సరపునాఁటి శాసనమొకటి కందూరి ఉదయనచోడమహారాజును బేర్కొనుచున్నది.

గోకర్ణుఁడను నొకరాజు కందూరేలుచున్నట్లు శాసనాధారములు గానవచ్చుచున్నవి. కాన భావిపరిశోధనమున వర్ధమానపురము, కందూరు

గోకర్ణుఁడు

పట్టణములు తమకు రాజధానులుగాఁ జేసికొని రాజ్యమేలిన కర్ణాటచోడుల వంశవృక్షము పూర్తిగాఁ దేలినగాని . వీరినిగుఱించి యేమి వ్రాసినను తొందఱపడినట్లగునని భయపడుచున్నాను. తెలంగాణాశాస నమున నొకటియగు పానుగల్లుశాసనమునందు సోమరాజునకు భేడగమ్మకు

నుద్భవించిన మేలాంబికకు ఉదయాదిత్యుఁడు, భీముఁడు, గోకర్ణుఁడు జన్మించిరనియు* వారిలో భీముఁడు మిక్కిలి దోర్విక్రమము కలవాఁడనియు వర్ణింపఁబడినది. అదిగాక మానిళ్లపల్లిశాసనములు, (తెలంగానా శా.) రెండీవంశజులనుగూర్చి కొంత తెలుపుచున్నవి. * వీనిలో నొకటి సౌమ్యసంవత్సర పుష్య శుద్ధ సప్తమీసోమవారమునాం డుత్తరాయణసంక్రాంతినాండు స్వస్తి సమధిగత పంచమహాశబ్దమణ్డలేశ్వర వీరమాహేశ్వరదుర్వార వీరవారసూర్యవంశోద్భవకుల తిలక కాస్య (శ్య) పగోత్రకరికాలాన్వయ నామాది సమస్తప్రశస్తసహిత శ్రీమన్మహామండలేశ్వర కందూరి గోకర్ణదేవచోడమహారాజులతో నడిగి తత్పాదపద్మోపజీవుండైన హరిహరదాసుండు బోయదేవ దండనాయకుండు చంద్రకంటిచింత కుంటస్థలమునందు మంగళ్లకాము చేసులో వెరసి ఆరుపుట్లుబీజములు పండే వరిపొలమును దానము చేసినట్లు దెలియుచున్నది. ఇందు శకసంవత్సరము కాని మఱియేదియుగాని యీయలేదు. మఱియొకశాసన మా గ్రామములోనిదే † "తీవ్రాంశకుల తిలకుఁడును, కరికాలకర్ణుఁడును"నగు గోకర్ణుఁడొకఁడు కలఁడనియు నతనికి, ఉదయాదిత్యుఁడు, భీముఁడు, గోకర్ణుఁడను ముగ్గురుకుమారులు కలిగినట్లును దెలియఁజేయుచున్నది. అందులో నుదయాదిత్యుఁడు చోడుఁడని ప్రసిద్ధికెక్కి మిక్కిలి ధర్మాత్ముఁ డనిపించుకొనెననియు, భీమగోకర్ణులు సూర్యచంద్రులవలె తేజోవంతులై నిస్సీమప్రేమబంధమును సమానసుఖులై వర్ధిల్లిరనియుఁ గలదు. వీరిలో భీముఁడు విళంబిసంవత్సర కార్తికమాసవిశుద్ధ ద్వాదశి తిథియందు 'తుమ్మట'గ్రామసమీపమున నొకకాల్వ త్రవ్వించి చూత ఘోషాగ్రహారమునం దుండు నృసింహేశ్వరదేవరకు భూదానమును గోకర్ణుఁడు మడింగంటి గ్రామభాగమును దానమును చేసికొనిరి. ఈశాసన కాలము శా. శ. ౧౧౪౧ అనగా క్రీ.శ. 1919_20 సంవత్సరమునకు సరిపో

---

* సుజాత ౧ సం. 3 సంచి. 1 మేలాంబికకు ఉదయాదిత్యుడు పుట్టినట్లు అతనికే భీముఁడు గోకర్ణుడు కలిగినట్లు ఒకరు వ్రాయుచున్నారు. (చూ. సుజాత ౧_3 సం).

† మానిళ్లపల్లి శాసనము సుజాత. ౧. సం.

వునని యొకమిత్రుఁడు చెప్పగా వ్రాసికొంటిని. అంతియేకాని దానిలో నే శకము చేర్కొనఁబడలేదు. దీనినిబట్టి చూడఁగా రుద్రదేవుని శాసనము లోని చిక్కు (చోడోదయ, భీమ, గోకర్ణ, కందూరోదయచోడరాజుల సంబంధమునుగూర్చిన చిక్కునుట) వదలిపోవునని తోఁచుచున్నది. మొదటి గోకర్ణుని పెద్దకుమారుఁడైన ఉదయనచోడుఁడు తండ్రియనంతరము కందూ రేలుచు రుద్రదేవుని భయముచేఁ జనిపోగా నతనికుమార్తెయైన పద్మను రుద్రుఁడు వివాహమాడినట్లును రెండవకొమారుఁడైన భీమచోడుఁడు వర్ధ మానమునకేగి తనకది రాజధానిగా నేలుచున్నట్లును, అన్నగారైన ఉదయాది త్యమహారాజు చనిపోయినట్లు తెలిసి భీముఁడు ఉదయాదిత్యుని యనంత రము కందూరు నేలుచున్న గోకర్ణునిజంపి భీముఁడారాజ్యమును దనరాజ్య ములోఁ గలిపికొనినట్లును, ఆ సంగతి తెలిసికొని రుద్రదేవుఁడు భీమునిమీ దికి దండెత్తిపోగా భీముఁడుభయపడి తనరాజ్యమునువదలి తనతల్లి సోద రుఁడు మొదలగువారితోఁ గలిసి యడవికి లేచిపోయినట్లును, దండెత్తివెళ్లిన రుద్రదేవుఁడు వర్ధమాననగరమును, దరువాత చోడోదయుని (ఉదయా దిత్యచోడుని) మహాపట్టణమైన కందూరిని, లంకాపట్టణమును నాంజ నేయులు తగులఁబెట్టినట్లు, కాల్చివేసెననియు మన మూహింపవలసివచ్చు చున్నది. ఈ నాయూహకు రెండు ప్రతిబంధకములు గానవచ్చుచున్నవి. ఒకటి—మామిళ్లపల్లిశాసనములో భీమగోకర్ణులు నిస్సీమప్రేమబంధనము గల వారని వ్రాయఁబడియుండఁగా భీముఁడు గోర్ణుని జంపుటెట్లు పొసగును? రెండు—జట్చర్లశాసనములోఁ జెప్పఁబడిన ఉదయనచోడ మహారాజు క్రీ.శ. 1162 వ సంవత్సరమునకు ముందుగా జంపఁబడియున్నట్లయిన నతని పేరు తో రుద్రదేవుని శాసనకాలముననే మఱియొక శాసనమెట్లు పుట్టఁగలదు? అప్పటికతఁడు బ్రతికియైన నుండవలెను లేదా, ఆ యుదయనచోడ మహా రాజు మఱొకఁడైన నయియుండవలెను. అనగా రుద్రదేవుని భయమునకు జచ్చిన చోడోదయుఁడు వేరు, పద్మావతితండ్రియైన 'కందూరోదయచో డుఁడు' వేరని యనుకొనవలసివచ్చును. రుద్రదేవుని శాసనములో భీముఁడు భోజనకాలమందు సోదరునిజంపి సవతితల్లినిఁ బెండ్లాడినట్లున్నది. దీని

కేమి సమాధానము గలదని మఱొకప్రశ్న పుట్టవచ్చును. దానికీ రీతిని సమాధానమీయ వలసియుండును. ఉదయాదిత్యునికి భీముఁడు (రెండవ), గోకర్ణుఁడు (రెండవ), అను నిద్దరు కొమారులు వేరు వేరు భార్యలం దుద్భవించిరనియు, గోకర్ణునికి కందూరురాజధానిగాను, భీమునికి వర్ధమానపురము రాజధానిగాను ఉదయాదిత్యుఁడు పంచియిచ్చినట్లు భావించుకొనవలెను. భీముఁడు దుర్బుద్ధిచే గోకర్ణునిజంపి అతని తల్లిని వివాహమాడినట్లును, ఆ సంగతి తెలిసి రుద్రదేవుఁడు భీమునిపైకి దండెత్తివెడలగా ఆభీముని కొమారుఁడు (రెండవ) ఉదయాదిత్యచోడుఁడు (అతఁడే చోడోదయుఁడై యుండవచ్చును) తండ్రిసహాయుఁడై వెడలి రుద్రదేవుని భయముచే ప్రాణములు వదలినట్లును మన మెంచవలసియున్నది. అట్లూహించినను జట్చర్ల శాసనములోఁ జెప్పఁబడిన ఉదయనచోడమహారాజెవ్వఁడో అతనికీ కర్ణాటచోడులతో నెట్టిసంబంధమున్నదో నాకు వివరింప సాధ్యపడకున్నది. పై నాయూహకు నాధారమైనవారి వంశవృక్షమీ క్రింది విధముగానున్నట్లొక మిత్రునియొద్ద నుండఁగా నించుకమార్పుతో నేను వ్రాసి యుంచికొనినది యిచ్చుచున్నాను.



పైనఁ జేర్కొనఁబడిన వంశవృక్షమున కాధారములు తెలంగానా శాసనములలోని వగు పానుగల్లు, మామిళ్లపల్లి శాసనములును, రుద్రదేవుని యనుమకొండశాసనమును నయియున్నవి.

రుద్రదేవుని రాజ్యవిస్తీర్ణము తూర్పున సముద్రమువఱకును, దక్షిణమున శ్రీశైలమువఱకును పశ్చిమమునఁ గటకము (కళ్యాణకటకము) వఱకును, నుత్తరమున మాల్యవంతపర్వతమువఱకును వ్యాపించియుండెను. (శ్లో. 48) రుద్రదేవుని శాసనకాలము (1163 A. D. నాఁటికి తని రాజ్యము తూర్పున సముద్రమువఱకు వ్యాపించియుండదని యాంధ్రుల చరిత్రకారుని యభిప్రాయము. అట్లు వ్రాయుటకు వారీకారణములు చెప్పుచున్నారు.—క్రీ. శ. 1163 నాటికి వెలనాటిచోళులు కాకతీయులకు లోబడకపోవుట. పైశాసనకాలమునకు ముందు గుంటూరు, కృష్ణా, గోదావరీమండలముల యందు రుద్రదేవునిశాసనములు గానరాకపోవుట. కాని వీరు వ్రాయునప్పటికి ద్రాక్షారామశాసనములు ప్రకటింపఁబడలేదు కాఁబోలు. రుద్రునిభార్య అన్నమదేవులశాసనము (1148 A. D. రుద్రదేవుని మంత్రియైన, ఇనంగలబ్రహ్మిరెడ్డిశాసనము క్రీ. శ. 1158) గోదావరిమండలములోని ద్రాక్షారామమునఁ గానవచ్చుచున్నవి కదా. అయినను శ్రీయుత, వీరభద్రరావుగారి యభిప్రాయము సరికాదని చూపుటకు జాలినంతప్రమాణము లేవియు నింతవరకు నాకు లభ్యముకాలేదు.

> రుద్రదేవుని రాజ్యవిస్తీర్ణము

రుద్రదేవుఁడు తనతండ్రియైన రెండవ ప్రోలరాజును బ్రమాదవశమున జంపెనని తెలిపెడి ప్రతాపరుద్రచరిత్ర వంటి గ్రంథములను విశ్వసించి చంపినస్థలముననే వెయ్యిస్తంభాలగుడికట్టెనని వ్రాసెడివ్రాతలు * రుద్రదేవుని దుర్యశః పంకమునఁ బడవేయఁ జూచెడి వ్రాతలేకాని సత్యనిర్ణయము చేయఁదగిన చరిత్రపరిశోధ

> రుద్రదేవుఁడు తనతండ్రినిఁ జంపెనుట నిజమా?

* వరంగల్ ఉస్మానియా ఇంటరుమీడియేటు కాలేజిమేగజైను 'దైవఘటన' అను వ్యాసము. సంపు. ౧—౧వ సంచిక.

# దక్షిణహిందూదేశము



తపతి నది
అజంటా
దేవగిరి
గోదావరి
కళ్యాణి
వేంగి
కృష్ణానది
శ్రీశైలము
రాజమహేంద్రవరము
తుంగభద్ర
కావేరి
కంచి
కాకతిరుద్రదేవుని రాజ్యవిస్తీర్ణము. 1163 A.D

కులు వ్రాయఁదగినవి కావు. ప్రోలరాజు వెలనాటి రెండవ చోడరాజుచే రణరంగమునఁ జంపఁబడి వీరస్వర్గమును జూఱగొనెనన్న యూహకు శాసనాధారమైనను గలదు. శిలోట్టంకితములైన శాసనములనైనఁ జూడక తండ్రితాతలు చెప్పుకొనెడి యితిహాసకథలు విని, చరిత్రపేరున వ్రాయఁబడిన వ్రాతలు నమ్ముకొని యట్లు వ్రాయుట కితరయాధారము లేమైన దొరకు వఱకు నోపికపట్టఁగూడదా?

పూర్వకథలు, స్థానికచరిత్రలు చరిత్రపరిశోధకుల కత్యంతోపయోగకరములగు ననుమాట వాస్తవమే కాని దాని నుపయోగించుకొనుటలోనే మన వివేచనాశక్తిని వినియోగింపవలసి యుండునని చెప్పుటకే నేనింతవరకు వ్రాయవలసి వచ్చినది.

ఇతని చావునకుఁ గారణము దేవగిరిరాజ్యాధీశుఁడైన జైత్రపాలుఁడు (క్రీ. శ. 1191_1210) అని డాక్టరు భండార్కరుగారు వ్రాయుచున్నారు. * కాని మ. రా. శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు (B. A., B. L. హేమాద్రిపండితుఁడు వ్రాసిన వ్రతఖండమలంకారభూయిష్ఠమైయున్నది. కావున నందులో జైత్రపాలుఁడు రుద్రదేవుఁడను నొక యాంధ్రరాజును నరమేధయాగము చేసెనని చెప్పినదానికి గణపతిదేవుని పక్షమున దేవగిరి మీదికి దండెత్తివెళ్లిన కోటరుద్రదేవరాజు (రెండవకేతరాజు కొడుకు) జైత్రపాలునిచేఁ జంపఁబడిన ట్లర్థము చేసికొనవలసియున్నదని సూచించినారు. † కాని రెండవ కేతరాజు క్రీ, శ. 1178_1209 వరకు రాజ్యమేలినట్లు శ్రీయుత రావుగారొప్పుకొనిన సంగతియేకదా! కేతరాజు మరణకాలమును, జైత్రపాలుని రాజ్యావసానకాలమును నొక్కటియే కావున, రాజ్యమునకురాని కోట రుద్రదేవుని నాంధ్రరాజని వ్యవహరింపఁబడి యుండునా? కాకతిరుద్రదేవరాజు, జైత్రపాలుఁడు సింహాసనాధిష్ఠితుఁడయిన యేఁడెనిమిది సంవత్సరముల వఱకు బ్రతికియుండుటయు, జైత్రపాలుఁడు మరణింపకపూర్వమే

---

* Deccan History 186 P. by Dr. R. G. Bhandarker.
† ఆంధ్రదేశము, విదేశయాత్రికులు. పుట. 115. by Mr. B. V. Krishna Row B. A., B. L.

కాకతిరుద్రదేవరాజు పరమపదించుటయుఁ జూడఁగా నితఁడు, దేవగిరిరాజులతోఁ గలిగిన ఘోరయుద్ధమున దివంగతుఁడయ్యె ననుట సత్యమునకు సమీపమగునని నే నెంచుచున్నాఁడను. దానినే హేమాద్రిపండితుఁడు జైత్రపాలుఁడు నరమేధయాగము చేసెనని యతిశయోక్తిగాఁ జెప్పికొనియుండును.

రుద్రదేవుఁ డోరుగంటికి రాజధానిని మార్చుట.

మఱొక ముఖ్యవిషయ మేమనగా శ్రీమన్మహామండలేశ్వరుఁడైన కాకతిరుద్రదేవమహారాజులు అనుమకొండవిడిచి యోరుగల్లురాజధానిగాఁ జేసికొనెనని కొలని గణపతిదేవుని శివయోగసారమను గ్రంథమునుండి శ్రీయుత చి. వీరభద్రరావుగారుదహరించిన యీ క్రిందిపద్యము గమనింపఁదగియున్నది.

* తరల. అనుమకొండపురంబుగాదని • యాదివిభుండిల నోరుగ
ల్లనుపురంబుఘటించి యచ్చటి • కచ్చుగా నరుదెంచియ
మ్మనుజనాథుఁడు నాయకత్వము • మల్లమంత్రికిఁ బిన్నమ
ల్లనకు ధారుణి పెద్దసంప్రతి • నాతతంబుగ నిచ్చినన్.

ఇది యిట్లుండఁగా, ఉప్పరపల్లిశాసనములో (క్రీ. శ. 1236) గణపతిదేవుఁడు అనుమకొండరాజ్యము చేయుచున్నట్లు తచ్ఛాసనపరిష్కర్తలగు డాక్టరు బార్నట్ గారు వ్రాయుచున్నారు. (Vide Hyd. Arch. Series No. 3.) హైద్రాబాదు ఆర్ష విచారసంఘ ప్రచురణము నెం. 3) నెల్లూరిశాసనములను బట్టికూడ గణపతిదేవుఁడు అనుమకొండలో రాజ్యము చేయుచున్నట్లున్నదని శ్రీ రామారావుగారు తెలుపుచున్నారు. కాని తెలంగానా శాసనములలో నొకటియగు బెక్కల్లుశాసనము (క్రీ. శ. 1195) లో రుద్రదేవుఁ డోరుగంటినుండి రాజ్యము చేయుచున్నట్లు వ్రాయఁబడినది. (చూ. J. A. H. R. S. 7 సం. 2 సం. కాకతీయశాసనముల పట్టిక.)

---

* సుభాషి ౧ వ సం. ౧ సంచి. పుట. 24. ఈ సుభాషిపత్రిక ప్రతి యొకటి నా కడుగగానే యిచ్చిన తత్పత్రికాధిపతులకు నా కృతజ్ఞతాభి
ము [illegible]. అ. శా.

పై విషయముల నన్నిటి సమన్వయించి చూచినయెడల రుద్రదేవుఁడు, గణపతిదేవుఁడు, అనుమకొండయందును, నోరుగంటియందును గూడ, నుండుచు వచ్చి, ఓరుగంటికోట బాగుగా బలపరచిన తరువాత గణపతిదేవుఁడు తన రాజధానినిఁ బూర్తిగా నోరుగంటికి మార్చియుండును. అట్లయినపిదప కూడ నోరుగంటి మట్టికోట * నిర్మాణము చూచినయెడల అనుమకొండ కోట యావరణములోనికి వచ్చునట్లుగా నేర్పాటుచేయఁబడినట్లు తెలిసికొనవచ్చును. పద్మాక్షి గుడిముందఱగల పెద్దగవని బ్రవేశించినచో సిద్ధేశ్వరునిగుడి వెనుక నొక పెద్దద్వారముగుండ నోరుగంటికి శత్రువుల కంటఁబడకుండఁగఁబోవు నేర్పాటు చేసికొని యున్నారు. ప్రస్తుతము దక్షిణపైపు అనుమకొండ మట్టికోటను భేదించి కొండపర్తికి బోవుదారి చేయఁబడినది ఇది పూర్వమునుండి యున్నది కాదు.

కాకతిరుద్రదేవునికిఁ బ్రతాపరుద్రుఁ డన్నపేరు చరిత్రకారు లెట్లు ప్రయోగించుచు వచ్చిరో కాని యితని నా పేరుతో బిలుచు నొకశాసనమైనలేదు. వాఙ్మయమందును నెక్కడను గానము. లోకములో మిక్కిలి ప్రసిద్ధిగాంచి చెప్పుకొనెడివాఁడు ముమ్మడంబా తనయుఁడైన వీరప్రతాపరుద్రదేవమహారాజే కావున రుద్రదేవుఁడనిన రెండవవాఁడే యని భ్రమలోకులకుఁ గలుఁగవచ్చునను కారణమునఁ గాఁబోలు మొదటి ప్రతాపరుద్రుఁడని చరిత్రకారులు రుద్రదేవమహారాజును బిలుచుటకు గడంగిరని యూహింప దగియున్నది. కాని మన రుద్రదేవుని ప్రతాపరుద్రుఁడని ప్రయోగించినందులకు నొక చిన్నయాధారము అనదగినట్టియు శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన బద్దెనకవి నీతిశాస్త్ర ముక్తావళిలోనిదని యుదహరించినట్టియు నీ క్రింది పద్యమును నాంధ్రకవుల చరిత్రలనుండి యెత్తి వ్రాయుచున్నాను.

---

* ఎటుచూచినను నోరుగంటికి నాగుమైళ్లుండి సుమారు ౩౽ మైళ్లు చుట్టుకొలతగలది అనుమకొండతో కలిపి వేయఁబడినది.

* చ. పరువడి నాంధ్రభాషగల బద్దెనసీతియు సంస్కృతంబులో
బరగఁబ్రతాపరుద్ర నరపాలునిచే రచియింపఁబడ్డయా
నరవరు నీతిసారము వినం జనువంగడు మంచిదంచు జె
చ్చరగవి నీతిపద్ధతులుచేసె వినోదము చాలబోధకం.

నీతిశాస్త్రముక్తావళి ప్రత్యంతరము గానవచ్చినపుఁడు దీనియందలి యీ యపూర్వప్రయోగముయొక్క నిజము కొంత వెల్లడికావచ్చును.

కాకతీయ రుద్రదేవుని గురించి శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావు గారును, మారేమండ రామారావుగారును నిదివరకే చాలవఱకు దెలిపియున్నారు గావున నితనిగుఱించి యధికముగా దెలిసికొనగోరువారు, వారు వ్రాసిన గ్రంథభాగములను జూచుకొనెదరు గాత! వివాదగ్రస్తములును జర్చనీయాంశములును నని నాకుదోచిన సంగతులను స్థాలీపులాకన్యాయమునఁ గొంత తెలిపితిని. ఇప్పటికీ విషయము నింతటితో ముగించుచున్నాను.

---

* ఆం. క. చ. మొ. భా. పునర్ముద్రితము. 242 పుట.

వే. గు. శా.

The entrance gate of Anumakonda Fort



అనుమకొండ కోట ప్రవేశద్వారము

# చారిత్రస్థలములు



ఇంతవఱకు నీ శాసనమునఁ జెప్పఁబడిన చారిత్రపురుషుల పేర్లు, వారి వివరములను వ్రాసియుంటిని. ఇఁకఁ జారిత్రికప్రదేశములఁ గూర్చి కూడఁ గొంతఁ గొంత వివరింపయత్నించెదను.

కాకతీయరాజులకుఁ దొల్లిటి రాజధాని నగరమైన యనుమకొండ పట్టణమిప్పుడు హనుమకొండ యనబడుచున్నది. ఇది నిజాం రాష్ట్రాంధ్ర

**అనుమకొండ**

భూభాగమునఁ గల వరంగల్ (ఓరుగల్లు) స్టేషనుకు నాలుగుమైళ్లు పశ్చిమోత్తరముగాను, ఖాజిపేట స్టేషనునకు నైదుమైళ్లు తూర్పుగాను నున్నది.

అనుమకొండయను పేరీపట్టణమున కెట్లు వచ్చెనో ప్రాచీనగాథల ననుసరించి యాంధ్రుల చరిత్రకారులు తమ యాంధ్రులచరిత్ర రెండవభాగములో వివరించియున్నారు. శాసనాధారములను బట్టి నిర్ణయించుట కింతవఱకెట్టి ప్రమాణమును జరిత్ర పరిశోధకులకు లభింపలేదు.

శాసనాధారములనుఁ బట్టియే యీ పేరీపట్టణమున కెన్ని నామాంతరములతోఁ నొప్పుచున్నదో యించుక తెలిపెదను. అనుమకొండ ప్రస్తావననుఁ దెచ్చిన మొదటిశాసనము ఖాజిపేట దర్గాలోనున్న శిలాశాసనము. దానిలో 'అన్మకొండ' యన్నరూపము కానవచ్చుచున్నది. * దానితరువాత పద్మాక్షి గుడిముందటి శాసనములో (క్రీ. శ. 1117) నీక్రిందిరూపము లున్నవి.

౧. అన్మకుండా (కురవరేశ్వరం) చూ. ప. ౧౬ తూ. వై.)

౨. అమ్మకుండె (యల) (చూ. పడ. 75 ప. వై.)

---

* చూ. J. A. H. R. S. P. 115 Vol VII-2 P ఆంధ్రేతిహాససంఘపత్రిక 7 వ సం. 2 పుట. భా.

వెయ్యి స్తంభాలగుడిశాసనమున 'అన్మకుండా' యనియు (2వ పజ్త్కి) అన్మకొండయనియు (6వ పజ్త్కి) ప్రయోగింపఁబడినవి. రుద్రదేవుని ద్రాక్షా రామశాసనమందు (క్రీ. శ. 1186) అను(ము)కొండ యని కలదు. బ్రాకెట్టులో వేయఁబడిన 'ము' అనునది 'మ' యనికూడ భావింపవచ్చును. దీనికే హనుమద్గిరి యనుపేరు వాఙ్మయమందుపయోగింపఁబడుటకు గారణము మృగ్యము. హనుమకొండయని పామరజనులు వాడినదానినట్లు సంస్కృతీకరించి మన పండితులువాడి యుందురు. అనుమఁడు, కొండఁడు అను నిద్దఱుక సోదరులవలన నీ పేరు వచ్చినదని ప్రాచీనగాథలయందు గలదఁట.

అన్మకొండ 'విషయము' కాకతీయుల కెట్లులభించినదియు మన ఖాజీపేట దర్గాశాసనమున నుండుట యొక గొప్పవిషయము. * అందిట్లున్నది.

శ్లో. జిత్వాపాన్తర మన్వయాపృథువనా గొడ్వర్తిదుర్గాత్మజం
హత్వాజౌగుణ సాగరస్యపురకూ దేశంచగొన్నాహ్వయం
తత్తద్భూయుతమన్మకొండవిషయం త్రైలోక్యమల్లక్షమా
ధీశాచ్ఛాసన బద్ధముద్ధత జయాసంలబ్ధవాన్ శాశ్వతః.

మొదటి ప్రోలరాజు యొక్క పరాక్రమముల వర్ణించుచుఁ బై సంగతి చెప్పబడినది. మొదటి ప్రోలరాజు కొంతమంది శత్రురాజులను జయించి ఆయారాజుల రాజ్యభాగములతోఁ గూడికొనిన యన్మకొండ దేశమును నప్పటి పశ్చిమచాళుక్య చక్రవర్తియైన మొదటి త్రైలోక్యమల్లుని యొద్ద నుండి శాశ్వతముగాఁ బొందినవాఁడని పైశ్లోకమును బట్టి తెలిసికొనవలసియున్నది. అట్లనుమకొండ 'విషయము' దొరికనది యనగా ననుమకొండ యప్పటికే యొక ప్రదేశమునకు రాజధానిగా నున్నదనియు, మొదటి పోలరాజుకూడ బశ్చిమచాళుక్యులకడ దండనాథుఁడుగా నుండియే వారిపక్షమునఁ దాను బొందిన జయములకుఁ బ్రతిఫలముగా నన్మకొండను సంపాదించినాఁడనియు, మనమెంచు కొనవలసియున్నది. పై నుదాహృతశాసన

* చూ. ఆంధ్రేతిహాస పరిశోధకసంఘ పత్రిక 7 సం. 2 భా. 115పుట.

**Nandi (the Bull) in the centre of Thousand pillared Temple.**



వెయ్యిస్తంభాలగుడిలో మధ్యనిలబెట్టఁబడిన నంది

మును బట్టి శాసనపరిశోధన యెంత తీవ్రముగాఁ జేసిన నన్ని క్రొత్తవిషయములు బయటపడి కాకతీయుల చరిత్రలోఁ గల యపూర్వవిషయములు లోకమునకుఁ బరిచితములగు ననుట కెట్టి సందియ ముండదు.

ఇది యిట్లుండనిండు. అనుమకొండ కాకతీయరాజుల సుప్రసిద్ధ రాజధాని నగరమై వెలసియున్నందున, నది యొక గొప్పపట్టణమై యపూర్వవైభవములతోఁ దులదూగుచుండెనని వేయి స్తంభాలగుడి శాసనమునుఁ బట్టి తెలియఁగలదు (శ్లో. 42-45) ఇది ప్రస్తుతము నొక సుబాకుఁ బ్రధాన నగరమై యుండుటయే కాక దీనియందుగల మిక్కిలి విఖ్యాతమగు సహస్రస్తంభ దేవాలయముయొక్క ప్రశస్తి దేశదేశాంతరములకు వెల్లడియై యున్నందున విదేశయాత్రికు లీయనుమకొండకు రాకుండ తమ దక్షిణ హిందూదేశయాత్ర ముగింపరు.

దీనికి వేయి స్తంభాలగుడి యన్న పేరెప్పటినుండి వాడుకలోనికి వచ్చినదో తెలియుటలేదు. ఇది శా. శ. ౧౦౮౪ చిత్రభాను సంవత్సర మాఘశుద్ధ త్రయోదశీ శనివారమునాఁడు ప్రతిష్ఠింపఁబడినదని యచ్చటి శాసనమువలనఁ దెలిసికొనఁ దగియున్నది. దీనికిఁ గల వేయి స్తంభాలగుడి యన్న పేరును బట్టి యచ్చట వేయి స్తంభములున్న వని యూహింపరాదు. అనేక స్తంభములని యర్థము గ్రహించుచో వేయి స్తంభాలను పేరు వాడుకలోనికిఁ వచ్చుట కిదియే కారణమని యెంచవచ్చును. ప్రస్తుతమున్న వేయి స్తంభాలగుడి యను పేరున బఱఁగు నంతటి ప్రదేశము రుద్రదేవుఁడు స్థాపించిననాఁడుండి యుండదు. అందులోని శిల్పి శిల్పచాతుర్యమునుఁ బట్టి మధ్యభాగమున గానవచ్చునెత్తైన నంది విగ్రహమున కెదుటి మంటపమే మొట్టమొదట నిర్మింపఁబడినదనియుఁ దానివెనుక భాగమున గల విడి విడి స్తంభాల కట్టడము మొదటి దాని ననుకరించి మఱొకప్పుడు నిర్మింపఁబడినదనియు మనము నమ్మవచ్చును.

వేయి స్తంభాలగుడి
క్రీ. శ. 1162-3

ఈ వేయి స్తంభాలగుడికిఁ దూర్పు ద్వారము సమీపమున రుద్రదేవుఁడు చెక్కించినదియు, నీ గ్రంథమున కాధారభూతము నయినదియు

నగు శిలాశాసనము కడుచక్కని యక్షరములతో నాల్గువైపులు వ్రాయఁబడి చూపరుల దృష్టి తనవంక కాకర్షించుకొను చున్నది. దాని వివరములు పాఠకు లికముందు గ్రహింపఁగలరు. దీని సమీపమున నొక గొప్ప దిగుఁడుబావి పెద్ద పెద్ద బండలతో సిమెంటు, సున్నము మొదలగు పరికరము లక్కరలేకయే కడురమ్యముగా నిర్మింపఁబడియుండి యెంతమంది యాత్రాపరులు వేంచేసినను, వారికి స్నానపానాదులకుఁ గావలసినను, రుద్రేశ్వరుని మహారుద్రాభిషేకము లెంతమంది భక్తులెన్ని సార్లాచరించినను 'గైకొనకుండుట మీ లోపమే కాని నా కొఱత యేమియు లేద'ని చెప్పగల జలసమృద్ధితో నా వాపీ ప్రదేశ మొప్పుచున్నది. అది యిప్పుడే యిట్లుండ పూర్వ మెట్లుండెనో! ఈ దేవాలయము చిరకాలము నుండి పూజాపునస్కారములు లేక ప్రస్తుతము హైద్రాబాదు నార్కి విచారసంఘమువారి పరిశీలన క్రిందనుండి బాగుచేయబడి శిథిలము కాకుండ రక్షింపఁబడుచున్నయది. మహాఘనత వహించిన నిజాం ప్రభుత్వమువారు మిక్కిలి వ్యయ ప్రయాసములకోర్చి దానినట్లు సంరక్షించుచున్నందులకు ఆంధ్రులమైన మనమెంతయో కృతజ్ఞత జూపవలసియున్నది. దీని నిర్మాణమును గూర్చియు, శిల్పకళనుగూర్చియు మాల్వీజి. యాజ్దానిసాహెబుగారు మిక్కిలి కొనియాడిరి.

అనుమకొండలోని యింకొక దర్శనీయమైన ప్రాచీనదేవాలయము పద్మాక్షిగుడి. ఈ దేవాలయము మిక్కిలి యెత్తైన కొండమీద గలదు.

**పద్మాక్షిగుడి**

కొండను దొలిచి పైన నొకశిఖరము నిర్మింపబడి, లోపల దేవీప్రతిష్ఠాపనఁ జేయఁబడినది. దీనిని క్రీ. శ. 1117 వ సంవత్సరమునఁ బ్రోలరాజు మంత్రియైన బేతన ప్రగ్గడభార్య మైలమ్మ 'కదలలాయ బసది, యను పేరున నిర్మింపించెను. పద్మాక్షిగుడి మొదట జైనదేవ్యాలయముగ నుండి తదనంతరము శైవులవశమై దుర్గాలయమై పద్మాక్షి పేరుతో నిప్పటికినిఁ బూజాపునస్కారములు గలిగి భక్తుల నాకర్షించుచునే యున్నది. ఈ గుడి ముందర తన్నిర్మాణమును దెలుపు శాసనము గల ఱాయి యిప్పటికిని నిలిచియున్నది. దానిపైఁ గల యక్షరములు వానజల్లులచేఁ గొట్టబడి క్రమ

వే. గు. శా.

## The Temple of Padmakshi



Photo by C. Mouli.

పద్మాక్షి దేవాలయము

ముగా నరుగుచు వచ్చుటచే నంత స్పష్టముగాఁ గానవచ్చుటలేదు. ఈ శాసనము ప్రత్యేకముగాఁ జర్చింపఁదగినది. ఈ శాసనశిలకుఁ బూర్వదిశయందున్న కొండకు జైన దిగంబర విగ్రహములు చెక్కఁబడి యుండుట కాననగును.

ఈ గుడికిఁ గ్రిందిభాగమున నొక తటాకము కలదు. దానిని పద్మాక్షి గుండమని లోకులు వ్యవహరించు చున్నారు. ఆ గుండము నంటియున్న వరిపొలమునఁ గొన్ని శిథిలము లయి పడి యున్న విగ్రహములలో నొక. దానినిఁ జూపి, పద్మాక్షి నిజమైన విగ్రహమదే యనియు, ఇప్పుడు పద్మాక్షిగుడిలో గలది జైన విగ్రహము గాదనియు, దానినిఁ దీసిగౌరీదేవి బొమ్మ నచ్చట యుంచి యుంచిరనియుఁ గ్రిందటి సంవత్సరము కాకతీయ వర్ధంతి జరిగిన సందర్భమున వచ్చి చూచిన శ్రీయుత చిలుకూరి నారాయణరావు గారు M. A. Ph. D. మొదలయిన వారభిప్రాయ పడినారు.

జైనవిగ్రహము లొక్క పద్మాక్షిగుడి యొద్దనే కాక యనుమకొండ దక్షిణదిశ నానుకొని యున్న పెద్ద కొండపైన దక్షిణవైపున మిక్కిలి రమ్యముగాఁ జెక్కఁబడి యున్నవి.

ఈ విగ్రహము లుండు చోటునకు నాగ్నేయమూలగా సిద్ధేశ్వరుని గుడికలదు. ఇది యతిపురాతన దేవాలయము. ఇప్పటికినిఁ బూజాదికము లచ్చట జరుగుచునే యున్నవి. దాని ముందర నొక గుండమున్నది. దానిని సిద్ధేశ్వరగుండ మందురు. ఆ సిద్ధేశ్వరుని గుడివెనుక నున్న గుట్టపైన నొక చిన్నమఠము శిథిలావస్థలో నున్నది. దాని కెమరుగా కొండప్రక్క భాగము నున్నగాఁ జేయఁబడి దానిపై సుమారు రెండుగజముల పొడుగు దూరము, రెండుగజముల నిలువుగాను నొకశాసనము నాంధ్రాక్షరములతో వ్రాయఁబడియున్నది. దానిని శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు భారతి ఆ 1924 సంవత్సరము 9 సంచికలోఁ బ్రచురించినారు. ఆ శాసనము సుమారిరువదియారు పఙ్క్తులు గలది యనియు, దా[illegible] పఙ్క్తుల్లు మాత్రమే వ్రాసికొంటి మనియు వా[illegible]

రించినారు. గ్రంథ విస్తరభీతిచే ననుమకొండ విషయమింతటితో విరమించి తక్కిన చారిత్రక ప్రదేశములను గూర్చి వ్రాయుచున్నాను.

కుంతోరి దేశమెక్కడిదో తెలియవచ్చుట లేదు. దానితరువాతఁ జేర్కొనఁబడిన మంత్రకూట నగరమును గురించి యించుక ప్రస్తావించెదను. మంత్రకూట మనుపేరు, నిజాంరాష్ట్రము నందుగల మంథెన, కాళేశ్వరవరము అను రెండు సుప్రసిద్ధ పవిత్రస్థలములలో మొదటిదానికి వర్తించును. ఈశాసనమునఁ జేర్కొనఁబడిన మంత్రకూటము (మంథెన) (మంథెన) మంత్రకూటము నూజవీడు తాలూకాలో జేరిన మంతెన యని కొందఱభిప్రాయపడిరి. * కాని యది పొరపాటని యిటీవలవారు గ్రహించిరి.

మంథెన నిజాం రాష్ట్రము నందలి కరీంనగర మండలములోఁ జేరిన యొకగ్రామము. గోదావరితీరమునఁ గలదు. ఖాజీపేటనుండి బలార్షాకు బోవు నయోమార్గమధ్యమమునఁ గల పెద్దపల్లి స్టేషనునందు దిగి మోటరుకారులో మంథెనకుఁ జేరవచ్చును. ఇది పూర్వమొక గొప్ప పట్టణమైనట్లును, దీనిని గుండరాజు పాలించినట్లును రుద్రదేవుని యనుమకొండ శాసనమునుఁ బట్టి తెలియవచ్చు చున్నది కదా. ఇది యిప్పుడొక బ్రాహ్మణాగ్రహారము వలెఁ గానవచ్చును. ఇచ్చట వెయ్యిమంది బ్రాహ్మణులుండెడివారని చెప్పుకొనెదరు. ఇచ్చట నుండు బ్రాహ్మణులు వేదాధ్యయనపరులును, సమస్తశాస్త్ర పారంగతులునై యుండిరి. ఇచ్చటి బ్రాహ్మణోత్తములు వేదాభ్యాసము నందు గొప్పకీర్తి సంపాదించి మంథెన్న 'ఘనాపాఠీ'లని తెలుగుదేశమున మిక్కిలి పేరు గాంచిరి. ప్రస్తుతమీ బ్రాహ్మణుల స్థితి యన్ని విధముల తీసికట్టుగా నయిపోయినది. ఇది యొక తాలూకా గ్రామమయి యున్నది. దీనితోఁ గలిపి చెప్పునది ధర్మపురి పేరు. మంథెనలోని బ్రాహ్మణులు బయట నుండు వారితో సంబంధములు చేయరు. అనగా తమ యాడు పిల్లలను బయట నీయరు. బయటనుండి

* ఆం. చ. 2 భాగము పుట.

బ్రాహ్మణకన్యలను దెచ్చుకొని యిప్పుడిప్పుడు వివాహము చేసికొను చున్నారు. ఎట్లయినను వా రితరులతోఁ గలియక పోవుటచే నొకవిధమైన యాస వారి భాషయందు గానవచ్చును. వారి కట్టు, జుట్టు, బొట్టుమున్నగు వేషములను బట్టి వారు మంథెనవారని తెలిసికొను స్థితిలో నున్నారు. ఇప్పు డిప్పుడు, ఉర్దు, ఇంగ్లీషు భాషల నభ్యసించువారి వేషములందు, అభ్యాస ములందుఁ జాల మార్పులు గలుగుచున్నను వారంద ఱొక ప్రత్యేకకుటుం బమునకుఁ జెందిన బ్రాహ్మణులుగా నుండు టొకవింత విషయము. ఆగ్రా మమున నిప్పుడు కూడ కొన్ని శాసనము లున్నవి. వానిలో మంథెన్నతమ్మె చెఱువుకట్టశాసనము మిక్కిలి ప్రధాన మయినది. ఆ శాసనమును గుఱించి శ్రీయుత తిరువరంగం పాపయ్యశాస్త్రిగా రొకప్పుడు గోలకొండ పత్రి కకు వ్రాసి పంపిరి. దాని సారాంశము నీ క్రింద నిచ్చుచున్నాను. *

"ఈ శాసనము నాలుగడుగుల పొడవును, ఒక యడుగు వెడల్పును గలదు. శిరోభాగముల యందు మొదట గణపతియు, రెండవ దిశకు సూర్య చంద్రులును, మూడవదిశకు గోవును, నాల్గవ దిశకు (నేమికలదో) సరిగా దెలియవచ్చుటలేదు...శాసనలిపి నాగరిభాష సంస్కృతము. క్లిష్టపద ప్రయోగములును, హస్తదోషములును, బెక్కులుగలవు. గండివేగిలి, పల్లె, కాలువ, కుంట, ఇత్యాది తెనుఁగుపదములను ప్రాతిపదికములుగా వాడఁ బడియున్నవి. శైలిప్రౌఢముగా గానరాదు. ప్రథమ, ద్వితీయభాగములు శ్లోకరచనతోడను, తృతీయచతుర్థభాగములు వచనరచనతోడను నున్నవి. * * * అల్లుం ప్రోలరాజుయొక్కయు, మల్లికార్జున సూరియొక్కయు, కేశవసూరియొక్కయు, కాకతీయ రుద్రదేవరాజు యొక్కయు, దానములు మాత్రమే చెప్పబడినవి. * * * మల్లికార్జున సూరిచే గణపతి దేవమహారాజ నామాంకితముగా స్థాపించిన యీ శాసనకాలము శా. శ. ౧౧౨౧ (క్రీ. శ. 1199-1200). గణపతిదేవ మహారాజు సింహాసనమునకు వచ్చిన సంవత్స రము గూడ పై (౧౧౨౧ శ.) సంవత్సరము గూడ సరిపోవుచున్నది. 'శ్రీ మంత్రకూట గోపీజనవల్లభాయనమః' అని శాసనము ప్రారంభించుటచేతను

* గోలకొండ పత్రిక 7 సం. 67 సంచిక. మొదటిపుట.

గోపీజనవల్లభదేవప్రశంస మనేకసారు లిందు పేర్కొనుటచేతను ఈ శాసనము గోపీజనవల్లభ దేవాలయము నొద్ద నుండఁదగినదని స్పష్టమగుచున్నది. * * *

ప్రథమశ్లోకమునందు స్తన్యపానము చేయుచున్న గజముఖుని వర్ణనమును, రెండవశ్లోకమునందు కాకతీయ వంశక్రమాగతముగా వచ్చుచున్న వరాహలాంఛన వర్ణనమును, మూడవశ్లోకమునందు అఖిలరత్నములకు నలకౌనుకారియైన ఆంధ్రనగరమగు ఓరుగల్లు వర్ణనము నాల్గవశ్లోకము నుండి ప్రథమభాగము కడవఱకు అఖిలనృపమౌళి వలయమణి కిరణతరంగతరంగిత పదాబ్జుండును, పయోధివేలారశనాభూమీశుఁడును నగు గణపతి నృపతి వర్ణింపఁబడినాఁడు. రెండవ భాగమగు దక్షిణమునందు నిగమాంతవాచాప్రవీణులగు మనీషులతోడను. ప్రాసాదాగ్రములఁ గల్పించిన కనక కలశ కాంతులతో రాత్రులంతయు సంధ్యారుణ ప్రభలతో నొప్పునదియు, సూరిగణములతో, మణిగణములతో, నవమౌక్తికస్రజములతో నొప్పు మంత్రకూటము కృష్ణనాయక సనాథయై మిగుల భూషింపఁబడినట్లు మంచెన వర్ణింపఁబడినది.

ఈ కృష్ణనాయకునకు జక్కమాంబ యందు మల్లికార్జునుఁడు జనితుఁడై తేజస్సుల కాకరమయిన రవివలె ప్రకాశించెను. ఈ మల్లికారునుఁడే మనశాసన కథాంశమునకు ప్రధానపాత్ర మనవచ్చును. ఇతఁడు కాకతీయ గణపతిదేవ మహారాజునకు మంత్రియో, ప్రధానియో, మండలేశ్వరుఁడో కావచ్చును. * * * శాసనకవి రఘుపతి యనుజన్ముఁడు గోపాలకవి. ఇంతటితో శ్లోకరచనా భాగము మూడవదిశ ప్రారంభముతో సమాప్తము. సకలదేశాచార్య కాకతీయ గణపతిదేవ మహారాజానుమతితో చెన్నూరు దేశపాలకుఁడును, ధర్మమూర్తియు నగు అల్లం ప్రోలరాజుచే గణపతిదేవ మహారాజ పురోహితుఁడగు త్రి...తమ విద్యావివేక మల్లభట్టోపాధ్యాయుని కొఱకు గ్రామతటాక నిర్మాణార్థము ధారాపూర్వకముగా నైకవింశతి శతోత్తరసహస్ర (౧౧౨౧) శకవర్షమగు సిద్ధార్థి సంవత్సర మకరసంక్రాంతి కాలమందు గోదావరీ ప్రణీతాసంగమమున నీ క్రింద

వ్రాయు చతుస్సీమల మధ్యగల ప్రదేశము దత్తము చేయఁబడినది, పూర్వమున వినాయక ఘుండి, దక్షిణమున గోదావరి. పశ్చిమమున అయ్యాన ప్రోలి లటాకము, ఉత్తరమున పుచ్చకాయల వేగిలి. ఈ ప్రదేశము నొద్దనే మంచనార్యునిచే తటాకగ్రామముల రచియింపఁజేసి మంత్రకూటవాటికా వాసుఁడగు బ్రాహ్మణుని స్వకుటుంబము కొఱకు దత్తమీయఁ బడినది. అచ్చట మహాదేవకేశవ ప్రతిష్ఠలు చేయఁబడినవి. శ్రీ మంత్రకూట గోపీజన వల్లభస్వామి కొఱకు ఆరామము దత్తము చేయఁబడినది.

నాకవలి మల్లికార్జున సూరి ధర్మము. మంత్రకూటము నందు గోపీనాథుని కొఱకు నాగవరిమునం దేకమును, అంగలూరి యందు ఏకనివర్తనమును పడి, లటాకము పరిసరమునందు యావనాలక్షేత్రము సహదత్తము చేయఁబడినది. కాకతీయ గణపతిదేవమహారాజానుమత్యా అని అల్లుం ప్రోలరాజు యొక్కయు, మల్లికార్జున సూరి యొక్కయు నామములు పేర్కొనఁబడిన మూఁడవభాగము సమాప్తమైనది, * * * * * మల్లికార్జున సూరి మఱికొన్ని దానములు నాల్గవభాగము ఉత్తరతః గుండివాగుః అని ప్రారంభించుటచే పూర్వదక్షిణ పశ్చిమసీమలును, తత్సీమాంతర్గత దాన గ్రామమును, అయదృశ్యశిలా భాగమునందే కలవు. ఆ సమయమందే శివలింగప్రతిష్ఠ చేయఁబడెను. ఒక బ్రాహ్మణునివలన కొటపల్లిగ్రామ మాను కొని దానికి మల్లికార్జునపుర మని నామముంచి తటాకము నిర్మించి ఆ పుర తటాకములను బ్రాహ్మణ స్వకుటుంబముల కొఱకు దానమీయవలెను. మల్లికార్జున పురస్సీమములు పూర్వమున పోతుగలు, దక్షిణమున 'కట్టు నల పశ్చిమమున మద్దికుంటవాంగు ఉత్తరమున ప్రెగడపల్లివాగు. అచ్చటఁదద ప్రభు నామాంకితముగా గణపతీశ్వర ప్రతిష్ఠయుఁ జేయఁబడినది. తదనుజుం డైన కేశవసూరిచే అంబా నారాయణప్రతిష్ఠ చేయఁబడినది.

'మల్లికార్జున ఉపశ్రుత్యా' (ప్రోత్సాహముచే) కాకతీయ రుద్రదేవ మహారాజు వలన గోపాలసూరిచే మంత్రకూటదత్తము పరిగ్రహింపఁబడెను. మఱియు గిరిపురతటాకములు నిర్మించి (ఇచ్చట గిరిశబ్దము రూఢి వాచకము అని గ్రహించవలయును) శ్రీ నృసింహస్వామిని ప్రతిష్ఠించి వింశతిగృహ

ములను నిర్మించి (వింశతిగోత్రముల వారు కౌబోలు) ఆ గృహవాసులగు బ్రాహ్మణుని కొఱకు మంథెన్న వాలువ (కౌలువ), ఎడ్లపల్లి, విలాసపురం, వీరపట్ల, నల్లబల్లి, కౌమిశే(ష్టి) పల్లి, జంగవీడు, గుంజవడిగ, నాగవరం, ఉప్పట్ల, వడకుడులయందు మఱికొన్ని గ్రామములయందు యావనాలమాలి కల శింశి త్తని? ద త్తముచేయఁ బడినది. శ్రీ నృసింహస్వామి కొఱకు ప్రోలె డ్డిపల్లె, కుందన్నవరను లందు రెండువృత్తములును లింగాల గ్రామమందు ఏకనివ ర్తనమును, గుంబుబడిగ, కేసనపల్లె, ఆషాఢ ఉమాపు, అని కొన్ని సందిగ్ధాక్షరములతో స్థలవభాగము సమాప్తమయినది. * * * ఈ శాస నము నెత్తి వ్రాయుటకు బ్రహ్మశ్రీ రాజవరం శేనం శాస్త్రిలవారును, శ్రీ శ్రీ శ్రీ నివాసరావు మున్సిఫ్ బి.యె. యల్. యల్. బి. (మంథెన)గారు ప్రోత్సాహకులై యున్నారు.”

మంథెన సంగతి యింతటితో విరమించి, వర్ధమాన నగరమును గూర్చి ముచ్చటించెదను. ఈ పట్టణమును గురించి శ్రీయుత చి॥ వీరభద్ర రావుగారు తమయాంధ్రుల చరిత్ర రెండవ భాగములో నిట్లు వ్రాసినారు “8 వ శతాబ్దములో రేనాటిని బరిపాలించిన ప్రాచీనాంధ్ర

**వర్ధమాన నగరము**

చోడులలో నొక శాఖవారు వర్ధమానపురము నుండి ప్రజాపరిపాలనము సేయుచుండిరి. * వర్ధమానపురము నైజాము రాష్ట్రములోని వనపర్తిసంస్థానమునకు సమీపమున శిథిలమై యున్న వడ్డమాని యను గ్రామము. ఇయ్యది పూర్వము మహాపట్టణమై యుండి యనేక దేవాలయములతో నొప్పుచుండెను. దీనిని 11 వ శతాబ్దాంతము నందుఁ గరికాలచోడాన్వయుఁడును, కాశ్యపగోత్రుఁడును నైన భీమచోడ నృపాలుఁడు పశ్చిమచాళుక్య చక్రవర్తులకు సామాంతమాం డలికుఁడై పరిపాలనము సేయుచుండెను.” ఈ పట్టణమునకు వడ్డమానను నామాంతరము కలదు. ఇచ్చట మూడుశాసనములు గలవు. ఇప్పటి రాజకీయ విభాగమును బట్టి యీ గ్రామము మహబూబునగర మండలమున నాగర్కర్నూలు తాలూకాకుఁ జేరి యున్నది. పై చేర్కొనఁబడిన శాసనములలో మల్యాలగుండయదండనాథుని శాస

నను ప్రతి హైద్రాబాదు ఆంధ్రపరిశోధక సంఘమువారికి లభించినట్లు తెలియుచున్నది. * శాసనకాలము శా. శ. ౧౧౬౭. అందులో కాకతీయ గణపతిదేవ రాజునకు గల సమస్తబిరుదములను దెలుపుటయే కాకయతఁడోరుగంటి నేలుచున్నను ననుమకొండ పురవరాధీశ్వర యని చేర్కొనఁబడినాడు. మల్యాలగుండయ యొక సామంతరాజువలె వర్ణింపఁబడినాఁడు. గుండయకుఁ గల బిరుదములలోఁ గుప్పాంబామానస సరోవర విహారమాణ రాజహంసుఁ డని కూడఁ జేర్పఁబడినది. ఈ శాసన మనేక విధముల మిక్కిలి ప్రధానమైనదిగా భావింపవలసి యుండును. కాకతీయులు శూద్రులని చెప్పుటచే దీని ప్రాముఖ్యత యెట్టిదో పాఠకులకుఁ దెలియఁగలదు. కాకతీయులు చతుర్థకులజులని తెలుపు శాసనభాగము సుజాతపత్రిక నుండి యెత్తి యీక్రింద నిచ్చుచున్నాను.

"అస్పృజచ్చతురో వర్ణాన్ముఖ బాహూరుపాదతః
అన్యాన్యుచ్చావ చాదీని భూతానిస్థావరాణిచ॥ ౪॥
అథస్వీకృత వర్ణోక్త ధర్మనిర్మలచేతసః
జాతాద్విజాతయః పశ్చాచ్చతుర్థ కులముజ్వలం॥ ౫॥
తత్రానేక నృపాలబాలలిఖితాం వీరాంకవర్ణోదధిం
దర్పందర్పమన గ్రసం సచుచర త్త్రీవ్రః ప్రతాపానలః।
యస్యోదంచిత కాకతీశ్వరకులక్షీరాబ్ధి సంవర్ధన
ప్రౌఢాహంకృతిచంద్రమా సమభవత్రోప్పలాభిధానోనృపః॥౬॥"

వర్ధమానపురమును గూర్చిన వివరములింకను నెన్నియో తెలిసికొనఁదగినవి కలవు. ప్రస్తుత మీవిషయ మింతటితోఁ జాలించి తక్కిన స్థలములలో నంతగా దెలియని కందూరు పట్టణమునుగూర్చి యొకటిరెండు వాక్యములు దెలుపవలసి యున్నది: కందూరు పట్టణమును బాలించిన చోడరాజులకును వర్ధమానపుర చోడులకును సన్నిహిత సంబంధమున్నట్లు గానవచ్చుచున్నది. కందూరు నేలెడి ఉదయనచోడమహారాజును

కందూరు.

* సుజాత, ౧ సం, ౧ సంచి, పుట, 36-37.

చేర్కొనిన శాసనములో నొకటి కొండపల్లిలోను మఱొకటి జట్చర్ల లోను గాన వచ్చుచున్నవి. ఈరెండు శాసనములలోఁ బ్రశంసింపఁబడిన ఉదయనచోడుడు, కందూరి ఉదయనచోడు డనఁబడినాడు. మామిళ్ళపల్లి శాసనములలో నొకదానియందు కందూరి గోకర్ణదేవచోడమహారాజుల పేరెత్తఁబడినది. వర్ధమానపురము నేలుచున్న భీమరాజునకు గోకర్ణునకుఁ గల సంబంధ మదివరకే చర్చించియుంటిని. కాఁబట్టి యీరెంటికిని సన్నిహితసంబంధ మున్నదని వ్రాసితిని. కందూరు వర్ధమానపురమునకు ౨౦ మైళ్లని యొకరు తెలుపుచున్నారు. కాని యీ పట్టణ మెక్కడ నున్నదో నేనింకను గనుగొనఁజాలక పోతిని. బళ్లారిమండలములో నున్నదని యొకరు వ్రాయుచున్నారు.

ఇఁక రుద్రదేవమహారాజు రాజ్యముయొక్క ఉత్తరపు సరిహద్దుగాఁ జెప్పఁబడిన మాల్యవంత మెక్కడ నున్నదియుఁ గనుగొనవలసి యున్నది.

**మాల్యవంతము.**

పూర్వ మీ పర్వతము సప్తకులాచలములలో నొకటిగాఁ జెప్పఁబడినది. ఇప్పటి భూగోళ పటములలో నిది గాన వచ్చుట లేమిచే నంతగా గొప్ప పర్వతము కాదని తోఁచెడిని. ఇది ప్లీని తలంచిన మలియసు Maleus లేక మాల్యవాను పర్వతము కావచ్చునేమో? ఇది కళింగ సరిహద్దున నున్న వింధ్యపర్వతము యొక్క తూర్పు శిఖరములలో నొకటి. (చూ. కళింగ సంచిక 253 పుట. 2 వ కలము).

కళ్యాణకటకము రుద్రదేవుని శాసనములో కటకమనియే వ్యవహరింపఁబడినది. ఇట్లే ప్రతాపరుద్రచరిత్ర మొదలగు గ్రంథములందుఁ గాననగును.

**కటకము. (కల్యాణము).**

పశ్చిమచాళుక్యచక్రవర్తుల ప్రప్రథమమున నేడవశతాబ్దమునుండి వాతాపి(బాదామి) పట్టణము రాజధానిగా సుమారు రెండువందల సంవత్సరములు రాజ్యము చేసినపిమ్మట, రాష్ట్రకూట రాజులు ప్రబలులై వారిలో నొకఁడు చాళుక్యుల నోడించి 'మాల్యఖేతము' (మల్ ఖేడ్, నైజాం) ప్రధాన నగరముగా చాళుక్యరాజ్యము నంతటిని లోబఱచుకొని

రాజ్యము చేయుచుండెను. క్రీ. శ. 973 వ సంవత్సరమునఁ బశ్చిమచాళుక్యవంశమునకుఁ జెందిన తైలపుఁడను నొకరాజు (రెండవ తైలపదేవుఁడు) రాష్ట్రకూటులఁ బారఁదోలి తమరాజ్యమునకు గుల్బర్గా మండలములోని కల్యాణపట్టణమును ముఖ్యపట్టణముగాఁ జేసికొని తమ పూర్వులు పోగొట్టుకొనిన రాజ్యమును మఱల సంపాదించెను.

౧౧ వ శతాబ్దారంభమున రాజరాజచోడుఁ డీపట్టణమును గొల్లఁగొనెను. క్రీ. శ. 1052–53లో మొదటి సోమేశ్వరుఁడను పశ్చిమచాళుక్య చక్రవర్తి రాజాధిరాజను చోళరాజును కృష్ణానదియొడ్డున కొప్పలగ్రామమున యుద్ధములోఁ జంపివేసెను.* కాకతి ప్రోలరాజుచే (రెండవ ప్రోలరాజు) బట్టుకొనఁబడి, విడిచిపుచ్చఁబడిన తైలపదేవుఁడు(మూడవ)ను పశ్చిమ చాళుక్యరాజు కల్యాణపట్టణము నేలుచుండగా గాలచురి వంశస్థుడైనట్టియు తైలపదేవునికి యుద్ధాంగమంత్రి యైనట్టియు బిజ్జను(లు) డనువాఁడు క్రీ.శ. 1157 సంవత్సరములో నితనిని రాజ్యభ్రష్టునిఁజేసి తానాపట్టణము నాక్రమించుకొని క్రీ. శ. 1162 నుండి రాజచిహ్నములు ధరించుచు భూమి నేలెను. బిజ్జలరాజ్యము చేయుచుండగా నతని మంత్రియైన బసవేశ్వరుని వీరశైవమత మాపట్టణమందు విరివిగా వ్యాపింప నారంభించుచుండగా జైనమత మావఱకే కల్యాణమున మిక్కిలి వ్యాప్తి యున్నందునను, బిజ్జన జైనమతాభిమాని కావునను, బసవేశ్వరునికిని రాజునకును సంఘర్షణ జరిగి తుదకు రాజు చంపఁబడెను. రాజధాని నగరమైన కల్యాణకటకమందు గొప్ప మతవిప్లవము జరిగెను. అప్పటికిని నిప్పటికిని నాపట్టణము మఱల దొల్లిటివైభవము నెప్పు డనుభవించియుండ వేదు.

కల్యాణకటకము గొప్ప సామ్రాజ్య చక్రవర్తులకు రాజధానినగరమైనప్పు డాపట్టణ మెట్టియైశ్వర్యసంపన్నమై వెలసెనో జైనగ్రంథములందును, వీరశైవ వాఙ్మయమందును గల యపూర్వ వర్ణనలను బట్టి తెలిసికొనఁదగియున్నది. ప్రస్తుత మది శిథిలావస్థలోనుండి యూరు, పేరులేక నిలిచియున్నది. అచ్చట శిథిలములైన శైవమందిరములు, జైన దేవాలయ

* Vin. Smith's Oxford History of India p. (201–202).

చిహ్నము లధికముగాఁ గలవు. వింధ్యకు దక్షిణమున నంతటిరైశ్వర్య మనుభవించిన పట్టణము మఱొకటి గానరాదని చెప్పిన నతిశయోక్తి కాఁజాలదు. ఆంధ్రచారిత్ర పరిశోధకమండలి (ఓరుగల్లు) పక్షమున మేము సంపాదించిన యముద్రిత తాళపత్రగ్రంథములలో నొకటియగు ద్విపద గౌడపురాణములో కల్యాణకటకమును గురించిన వర్ణనము కలదు. దాని నిచ్చట నుదాహరించుచున్నాను.

"గౌడదేశమువారు గౌడభూసురులు
గౌడగృహస్థులు, గౌడసెట్లన్న
తడయక బసవన్న దర్శింపఁగోరి,
కడు భక్తియుక్తులై కల్యాణమునకు
జనవర్గకుటుంబ సహితంబుగాను
జనుదెంచి పెక్కుయోజనములు గడచి
బోరునఁ గల్యాణపురి సమీపమున
జేరి తత్పురము వీక్షించి రచ్చెరువున,
గడునొప్పుచున్న శృంగారంబు దాని
తనరారు నందికేతనముల దాని
వర్ణన దివ్యసౌధంబుల దాని
శృంగారములచేత శోభిల్లు దాని
శైవవిద్వజ్జన సంఘంబు దాని
మహనీయమగుచున్న మఠముల దాని
విహితంబులగు హేమవీధుల దాని
వారణహయ భటవ్రాతంబు దాని
చారుకాహళశంఖ వాటంబు దాని
పటుతరచతురంగ బలముల దాని
సద్భక్తి విహితుల సంఘంబు దాని
నిశ్చలశివభక్తి నిశ్రేణిదాని

కనుగొనియాశ్చర్య కలితాత్ములగుచు
వినుతించి పురము ప్రవేశించిరంత॥

(మల్లికార్జున సిద్ధయోగివిరచిత ద్విపదగౌడపురాణము. ప్రథమాశ్వాసము.)

'శ్రీశైలము ద్వాదశ శివలింగక్షేత్రములలో సుప్రసిద్ధమైనది. ఇది ధాన్యకటకము (ధరణికోటకు) నకు ౧౦౫ మైళ్లు దూరమునను W.S.W. కందనోలునకు (Karnool) ౮౫ మైళ్లు దూరమునను (E. N. E.) నున్నది. ఇచ్చటగల శివునకు మల్లికార్జునస్వామియని పేరుగలదు. ఇది పూర్వము బౌద్ధపండితులకు నివాసస్థానముగా నున్నట్లు చరిత్రవలనఁ దెలియుచున్నది. ఇది యిప్పటికిని దక్షిణహిందూదేశమందలి మిక్కిలి గొప్ప శైవక్షేత్రమయి లక్షలకొలది తీర్థయాత్రాపరులను శివరాత్రికిఁ దనవంకకు నాకర్షించుకొనుచున్నది. దీనిని గుఱించిన యీ క్రింది సంగతులను బాటకుల సౌకర్యార్థము ఆంధ్రపత్రికా ముద్రణాలయమున ముద్రింపఁబడిన శ్రీశైలక్షేత్రము' అను గ్రంథము నుండి యిచ్చుచున్నాను. *

శ్రీశైలము మహాభారతము నందు, రామాయణము నందును బేర్కొనఁబడినది. గోకర్ణస్వామి నవనాథసిద్ధుఁడు దీనియందు నివసించి యుండినట్లు గాథలున్నవి. శాలివాహన శకారంభమునకుఁ బూర్వము నాగార్జునుఁడు శ్రీశైలమున నివసించినట్లు బౌద్ధగ్రంథములు తెలుపుచున్నవి. ఆపర్వత శ్రేష్ఠమున నొక భాగము నాగార్జున కొండయను పేరుతో నొప్పుచున్నది. నాగార్జునుఁ డాంధ్రదేశస్థుఁడని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. శ్రీశైలము బౌద్ధారామముగా నుండెను. ఆంధ్రరాజుల వినాశము, బౌద్ధమత సంక్షయము, శ్రీశైలక్షేత్రము క్షీణించుట, వరుసగా జరిగెనని చెప్పవచ్చును. 2 వశతాబ్దమున చీనా యాత్రికుఁడు హ్యూయన్సాంగ్ శ్రీశైలబౌద్ధారామమును వర్ణించెను. శ్రీమచ్ఛంకరాచార్యుల వారు ద్వాదశలింగస్తోత్రమునందు దీనిని స్మరించెను. 7 వ లేక 8 వ శతాబ్దమున ‧మనిన అప్పర్ సుందరర్, సమ్మందర్, అను తమిళభక్తులు శ్రీశైలభ్రమరాంబికా

---

* దీనివెల ౧-౦-౦. దొరకుచోటు :—

పాణ్యాం రామయ్యగారు, కోవెలకుంట్ల, కర్నూలుజిల్లా.

మల్లికార్జునులను తేవారవృత్తములతోఁ గీర్తించిరి. 9 వ శతాబ్దమున కదంబరాజు యూరవర్మ శ్రీశైలప్రాంతమును స్వాధీనము చేసికొని యేలెను. తేవారమను ద్రవిడకావ్యము నందు శ్రీశైలమాహాత్మ్యము వర్ణింపఁబడినది. ౧౨ వ శతాబ్దమునందు అచ్చటి హొయసలరాజులు అచ్చటి పాతాళగంగనుండి లింగశిలను తెప్పించినట్లు శాసనములు కలవు. కాకతీయప్రతాపరుద్రునకు సంబంధించిన శాసనములు శ్రీశైలమునఁ గలవు. ప్రతాపరుద్రుఁడు దేవాలయము క్షేత్రపాలనమున వినియోగించెను. 14 వ శతాబ్దారంభమున నేమారెడ్డి పాతాళగంగకు సోపానములు గట్టించెను. హరిహర (ii) వీరప్రతాప ప్రౌఢదేవరాయలు, సాళువరాజులు మల్లికార్జునలింగము పూజించి నూతులు, కోనేళ్లు మొదలయిన వానిని గట్టించిరి. కృష్ణదేవరాయలు శ్రీశైల మల్లికార్జునుని దర్శించి ఆ దేవునికి నగ్రహారము లిచ్చెను. ఇట్టి రీతిగా విజయనగర సామ్రాజ్యపతనము వఱకు నక్షేత్రము మహోన్నతదశయం దుండి ఆయా రాజులచేతను భక్తులచేతను దర్శింపఁబడుచుండెను. అచ్చటి బంగారపు నగలు మొదలగునవి చెంచు రాజులకాలమున దొంగిలింపఁబడి అమ్ముకొనఁబడియు నాక్షేత్రము మఱల క్షీణింపగా దానిని బునరుద్ధరింపఁ బ్రయత్నము లిప్పుడు తీవ్రముగా జరుగుచుండుట సంతోషావహమైన సంగతి.

ఇక ముఖ్యమైన 'మద్దిచెఱువుల' గ్రామమునుగూర్చి కొంతవివరించెదను. రుద్రదేవుడు స్థాపించిన రుద్రేశ్వరుడు మొదలగు దేవతల పూజాదికము లవిచ్ఛిన్నముగాఁ జరుపుటకు నీగ్రామ మీనామముగా నియ్యఁబడినది. (చూ. శ్లో. 48). ఈగ్రామమును డాక్టరు ప్లీటు మద్దిచెఱువుల గ్రామము. మట్టిచెఱ్వులయని చదివినాడు. ప్రస్తుతము వరంగల్ తాలూకాలో నిట్టిపేరుతో నేగ్రామమునున్నట్లు కనుపించుట లేదు. మొగిలిచెర్లగ్రామ మొకటి వరంగలువకు సమీపమున నున్నదికాని యిది యది యనిచెప్ప సందేహించుటతోఁ డాక్లరు ఫ్లీటు దానిని ప్రస్తావించి విడిచినాఁడు: ఈగ్రామ మెప్పుడో నశించి యుండును. ప్రస్తుత మిదమిత్థమని దీని గురించి యేమియుఁ జెప్పవీలులేదు.

మన నిజాంరాష్ట్రీయు లీరీతిగాఁ జరిత్రాంశములను బూర్వోత్తర సందర్భములతోఁ దెలిసికొనఁ బ్రయత్నింపవలెనని సూచించుచున్నాను.

---

**The Goddess of Padmakshi inside the Temple worshipped at present.**



ప్రస్తుతము పూజాదికములు జరుపఁబడుచున్న
పద్మాక్షీ దేవి విగ్రహము.

**The picture of Another Goddess inside the Padmakshi Temple.**



పద్మాక్షి గుడిలోని మఱియొక స్త్రీ విగ్రహము.

# వేయి స్తంభాల గుడి శాసనము



## పడమటి వైపు

1. ఓం స్వస్తి శ్రీవ్విజ్ఞ (విజ) జయశ్చాభ్యుదయ శ్చ భవతు॥ సమధిగత పంచమ
2. హాశబ్ద మహామండలె (లే) శ్వర అన్మకుండా పురవరె (రే) శ్వర పరమ మాహే (హే) శ్వర
3. పతిహిత చరిత వినయ విభూషణం శ్రీమన్మహామండ లె (లే) శ్వర కాకతి (తీ)
4. య రుద్రదె (దే) వరాజుల విజయ రాజ్యముత్తరో (రో) త్తరాభి వృద్ధి ప్రవర్థ్ధ (ర్ధ) మా
5. నమాచంద్రార్క్క (ర్క) తారము [గా] అన్మకొండపట్టనమునందు సుఖసం
6. కథా వినోదంబున రాజ్యంబుసె (సే) యుచునుండ శకవర్షములు ౧౦౮౪ వునెం (నేం) టిచిత్ర
7. భాను సంవత్సర మాఘ శు ౧౩ వడ్డవారమునాం (నాం) డు తనపె (పే) ర రుద్రె (దే)
8. శ్వరమును శ్రి (శ్రీ) వాసుదె (దే) వర శ్రి (శ్రీ) సూర్య్య (ర్య) దె (దే) వరా * ను ప్రతిష్ఠసె (సే) యించె.
9. [శార్దూ యస్యోత్తుంగ తరంగతాడిత (వి) యత్సప్తార్ణ్ణ (ర్ణ) వి (వీ) యం జలం పాదాంగు
10. ష్ఠనఖాగ్రదఘ్న మభవ ద్బ్రహ్మాండలో (లో) ద్ధా (ద్ధా) రణె (ణే) దంష్ట్రాకో (కో) టికుటి (టీ) రకో (కో)
11. టరగతం త్రైలో (లో) క్య మబ్బింధు వ ద్బ్రహ్మాండా ఇవ రో

---

* దేవరను అని చదువవలెను.

(రో) మకంద నికరా † (రో) వంఛ (దే) వరా

12. హం హారి॥[౧] శ్రీహే (హే) రంబ విలంబి కుంతలని లన్మల్లి (ల్లీ) దలత్కూట్మల వ్రాలో (లో) జ్బ (జ్జ్వ) లభిత [।]

13. [౧౦] ధలుబ్ధమధు పధ్వానోత్కరస్యాస్పద స్ని (స్ని)గ్ధ) తత్రి (ప్రీ) త మనా భవ త్వ మిహ మె (మే) ది [।]

14. గ్ధ]౦తి దంతద్యుతిస్రా (ప్రో) ద్దామోద్దల సైక విక్రమల సద్దంతాంత• కాంత్యాశ్రయః॥ [౨].

15. [వసం]. [భూ] తె (తే) వసుగ్ధ (గ్ధ) లహారి (రీ) భిరుదంచలి (తీ) వ [।] దుగ్ధా (గ్ధో) దధ (ధే) రమృతిది (దీ) ధతి నిర్మిత (నిర్మిత) తె (తే) వ।

16. శ్రీ (శ్రీ) ఖండపిండ పరిపాండుర పుత్రలి (లీ) వ [।] వక్త్రే) (క్త్రే) వస త్వవిరతం తు సరస్వతి (తీ) నః॥ [౩]. [శా]. భా

17. రద్వాజకులశ్రియః పరివృఢ (ఢః) శ్రౌతక్రియాకర్మఠ (మఠ) ః।
శ్రీ (శ్రీ) రామె (మే) శ్వరది (దీ) క్షితో (తో)

18. జనయితా యస్యక్షితావగ్రణి (ణీః)। సో [సో] చింతె (తే)౦ద్ర వరో (రో౽) ద్వయామృత య

19. తె (తే) శ్శిష్యో యతి (ః) శ్రద్ధయా శ్రీ (శ్రీ) మన్ముద్ర నరె (రే) శ్వర స్య సుమతె (తే) వ్వర్ణ (వర్ణ)ంశావలి (లీ)ం

20. వర్ణ (ర్ణ) యె (యే)॥ [౪]. [ఆర్యా]. శ్రీమత్రి (త్రి) భువన మల్లా (ల్లో) రాజాకాకత్య వంశసంభూతః। ప్రబలరి

21. పువర్గ (ర్గ) నారి (రీ) వైధవ్య విధాయకాచార్య (ర్య)ః॥ [౫]. [శా] శ్రీకాకత్యనరె (రే) ౦ద్రబృందతిల

22. కొ (కో) వైరి (రీ)౦ద్రవ్రాత్రాపకః [।] సత్పాత్రె (త్రే) వసుదా యకః। * ప్రతిదినం కాంతా మనోరంజ

---

† రా అని శ్లీటుపాఠము. 'తో' అని చదువవలెను.

• 'తి' అని చదువవలెను.

* పాదాంతము నుండవలసిన గీత నిక్కడ లేఖక ప్రమాదవశమునఁబడినది.

23. కః [।] మస్యాంతాచయ దూషకః పురహరః † శ్రి (శ్రీ) పాద పద్మార్చ (ర్చ) కొ (కో) [।] న్యగ్భూతి (తీ) కృతనాయక త్రి
24. భువన శ్రి (శ్రీ) మల్ల దె (దే) వో బబొ (భౌ)॥ [౬]. [శా]. తత్పు త్రె (త్రై) : శివపాద పద్మయుగళ ధ్యానామృతానం
25. దభూ [।] ల్లర్ల (ల్ల)ంతాకొ (కో) రిపుసుందరి (రీ) జనమహా సౌభాగ్యసంప(చ్ఛి) (చ్ఛి) యః ప్రొ (ప్రో)
26. లొ (లో) ‡ రాజఇతి ప్రసిద్ధి మగమ ద్వైరి (రీ) ంద్రదప్పార్ణ (పా) పహో [।] నిశ్శంక ప్రథన ప్రబం
27. ధనమహా హంకారలంకె (కే) శ్వరః॥ [౭], [శా]. హస్త్యారొ (రో) హణకర్మ (ర్మ) కర్మ (ర్మ) తగతిం
28. చాళుక్యచూడామణిం [।] శశ్వద్యుద్ధ నిబద్ధగర్వ్వారమతిం యుద్దెబ
29. బంధక్షణాత్। శ్రి (శ్రీ) మత్తైలపదె (దే) వమంబుదని భ స్తంబె (బే) రమస్థం త్క్షణా [।]
30. త్ప్రఖ్యాతొ (తో) రిపుకంఠ ఖండనవిధా భక్త్యానురాగాజ్జహా॥ [౮] [శా]. యో * కంఠొ (తో) రి
31. పతె (తే) రకుంఠ పరశుశ్లక్ష్ణా(గధారో $ ల్లస [।] ద్ధారాపాతని పాతనైకచతురం
32. [గో] విందరాజాహ్వయం। బధ్వొ (ధ్వో) న్మచ్యుతదొ (దో) దయక్షితిభృతె (తే) రాజ్యం దదౌ [।]
33. [లీ] లయా లుంతాకొ (కో) విషయస్య తస్య సమరె (రే) సద్వి (ద్వీ) ర ది (దీ) త్యాగురః॥ [౯]. [శా]. క్రుద్దె (ద్ధే)

---

† విసర్గములుండుట తప్పు.

‡ ప్రోలెరాజ అని డాక్టరుగారి పాఠము కాని గణసౌకర్యము కొఱకు ప్రోలేరాజ అని వారు చదివియుందురు.

* యః అని యుండవలెను.

$ ఇక్కడ మాత్రమే ఓత్వమునకు దీర్ఘము కానవచ్చు చున్నది.

34. నోద్ధురమంత్రకూటనగరిం * (రీ) నాథో (థో౽) థ యో నిస్త్ర
ప్రా (ప్రో) [1] గుండః ఖండిత ఎ (ఏ) వ సుం

35. డితశిరాః క్రో (క్రో) డాంకవక్ష (ః) స్థలః। ఎ (ఏ) డో (డో) డిం
భకవత్పలాయన పరో (రో) జాతో (తో) గలః

36. స్వాంపురి (రీ) [।] మాహతో (తో౽) పి నృ (పే) శ్వరస్య
పురతః ప్రా (ప్రో) లె (లే) నయుద్ధాయ యత్॥ [౧౦].

37. [శా]. అన్యచ్చానుమకొండ నామ నగరి (రీ)ం సంవె (వే) శ్యయో
(౽) యం స్థితో (తో) [।] నానామండలికొ

38. న్వితో (తో) భువి జగద్దె (ద్దే) వ స్స ద (దే) వ్యపఘః। స్తబ్ధ (బ్ధ)
స్తంభిత ఎ (ఏ) వకొర్య్యు (ర్యు) కరణె (ణే౽) శక్తః

39. క్షణాన్నిర్గ్గ (ర్గ) తః [।] శ్రి (శ్రీ) మత్రోప్రోల నృపస్యతస్య
జయినః కి (మ్) బ్రూమహే గౌరవం॥ [౧౧].

40. [శా]. ద (దే) వి (వీ) ముప్పమనామధె (ధే) యసహితాయస్యాగు
ణాస్తారకాః [।] కి (కీ) ర్త్తి (ర్తి)ః శారద చ

41. ంద్రికె (కే) వ విలసత్కాంతె (తే౽) స్తు నైవో (వో) పమా। కౌస
ల్యే (ల్యే) వ చ జానకి (కీ) వ చ సతి (తీ) కున్తి (న్తీ)

## దక్షిణపు వైపు

1—42. వ పద్మె (ద్మే) వ సా పౌలో (లో) మి (మీ) వచ చండికె (కే) వ చ
2—43. వరాతస్యా (౽) భవద్భామిని (నీ)॥ [౧౨]. [శా]. తస్యాస్తస్య
3—44. సుతో (తో౽) జని (నీ) హ పరమానందైక కందాంకు
4—45. రః [।] కామః కిం నలకూబరః శివసుతః
5—46. స్కందో (దో) జయంతో (తో౽) థవా। జిష్ణుర్వ్వ (ర్వ) 
వజ్రధరో (రో౽)

---

* ఈ సున్న తాతిమీద నున్నదికాని ఫ్లీటుగారి కిచ్చిన శాసనప్రతి లో లేదు. ఇది అవసరము.

వే. గు. శా.

**Jain sculpture in the Northern hill in the fort of Anumakonda**



Photo by Mr. R. S. Iyyer.

అనుమకొండ దుర్గములోని ఉత్తరపు కొండకుఁగల జైనశిల్పము

6—47. థవా వారి రయం దస్రౌ కుమారౌ నతె (తే) [।] భ
7—48. క్తః శ్రీగిరిశె (శే) హితాయ జగతః శ్రి (శ్రీ) రు
8—49. ద్రదె (దే) వొ (వో) నృపః॥ [౧౩]. [శా]. త్వంగత్తుంగ తురంగ పుం
9—50. గవచయారొ (రో) హక్రమె (మే) కమ్మ్ణ (ర్మణ) తం [।] డొ
10—51. మ్మం చారు పరాక్రమ క్రమభరం భ
11—52. క్త్వ (క్త్వా) సకృల్లి (ల్లీ) లయా। కణ్ణ్ణ (ర్ణ)ం పార్త్థ (ర్థ) ఇవా
12—53. మలైః శరశలైవ్విర్ (వైర్) ద్రావ్య విద్రాశ్య యో।
13—54. లె (లే) ఖె (ఖే) సవ్వ్ర (ర్వ) విశె (శే) షయుక్తనగరగ్రామం
14—55. సరుద్రొ (ద్రో) నృపః॥ [౧౪]. [శా]. ఈడె (డే) మె (మే) డవి డంబ డం
15—56. బరభరత్షో దత్షమం త్ష్మాభృతాం [।] దువ్వ్ర (ర్వా)
16—57. రొ (రో) ద్ధురవి (వీ) రమంత్రసమయాదాసైకది (దీ)
17—58. క్షాగురుం। శ్రి (శ్రీ) మన్స్మేళిగిదె (దే) వసంగస
18—59. మయప్రొ (ప్రో) ద్భూతదప్ప్ర (ర్పా) పహం [।] ప్రాప్త
19—60. శ్రి (శ్రీ) పాలవాసదె (దే) శవిభవం శ్రి (శ్రీ) రుద్రదె (దే)
20—61. వం సదా॥ [౧౫]. [వసం]. బి (భీ) మె (మే) నబి (భీ) మ నకులె (లే) నకు
21—62. లె (లే) న హి (హి) నో [।] గ్రస్తో మమార గృహమా
22—63. షకవత్తణె (ణే) న। మాజ్జ్ఞా (ర్జా) రడింభకవరె (రై)
23—64. ణ మహాంధకారె (రే) [।] గోకణ్ణ్ణ (ర్ణ) నామభు
24—65. జగొ (గో) భువికూరమాని (నీ)॥ [౧౬]. [శా]. శ్రి (శ్రీ) మద్రు
25—66. ద్రపరాక్రమోద్భవభయ వ్యామోహ
26—67. నా [।] ఖోల్లసచ్ఛ స్త్రుత్రస్త సమస్తగాత్ర
27—68. విలసచ్చొ (చ్చో) డొ (డో) దయత్ష్మాపతె (తే)ః। ఉన్మత్తా
28—69. ఇవ విస్మృతా ఇవ [।] మహాభూతాభిభూ

29—70. తా ఇవ [।] ప్రా (ప్రో) ద్భ్రాంతా ఇవ సంకులా ఇవ

30—71. తద్వాప్రాణాః ప్రయాతా దివం ॥ [౧౭]. [వసం]. యాతె (తే౽)

31—72. పిత్రైలసన్నృపె (పే) దివ మస్యభి (భీ) త్యా [।] సర్వ్వార్గ (వార్గ)

32—73. తిసారకబలి (లీ) కృతగాత్రయష్టా (ష్టౌ) । శ్రి (శ్రీ) రు

33—74. ద్రదె (దే) వనృతపతె (తే)ః పృథువిక్రమస్య భి (భీ) మో(౽)

34—75. పి రాజ్యపదవి(వీ)ంక్షణికాంసతె (తే) భేః॥ [౧౮]. [శా]. ఏ [ఏ] కో (కో) జం

35—76. బుకడింభకో (కో) లఘుతరైస్సంవె (వే) ష్టితో (తో)ం * జంబు

36—77. కై [।] రాజా (౽) హంకృతిధిక్కృ (క్కృ) తక్షితిలతలస్సింహె (హే) న సం

37—78. స్పర్ద్ధ (ర్ధ) తె (తే) । ఫే † త్కారాకుళగజ్జ (ర్జ) త్తైమ్మ్ర్గ (మ్ర్గ) ఖరయ న్న

38—79. వ్వార్గ (వార్గ) దిశో (శో) విహ్వలో (లో) [।] యాతః క్వాపి సటావిధూన

39—80. నభరైః కంఠీరవస్యాతురః ॥ [౧౯]. [శా]. తద్వ్యాఘ్ర (ఘ్ర) మన్నృ

40—81. పాధమో నరపశు మ్మ్మార్గ (మార్గ) తుః సపత్ని (త్నీ) పతి [।]

41—82. ర్గాంతా భ్రాతృవరస్య బో (భో) జనవిధాబి (బీ) మె (మే)

42—83. న సంస్పర్ధ (ర్ధ) తె (తే) । ఆకాశగ్రసనప్రయాస

43—84. నిరతః శ్రి (శ్రీ) రుద్రదె (దే) వె (వే) నయ [1] త్స్వర్ద్ధా (ర్ధా) వర్ద్ధి (ర్ధి)

44—85. తగర్వ్వ (ర్వ) పర్వతమహాశృంగాగ్రమారో (రో) హ

45—86. తి॥ [౨౦]. [శా]. శ్రుత్వాబి (భీ) మనృపస్యరాజ్యవిభవంచా

46—87. రైశ్చదుశ్చె (శ్చే) ష్టితం [1] శ్రి (శ్రీ) మద్రుద్రనరె (రే) శ్వరో (రో౽) థ

---

* ఇక్కడనున్న రాతిమీద పొరపాటున వ్రాయఁబడినది.

† ఇది డాక్టరు ఫ్లీటుగారి పాఠము. దీనిని కొందఱు ఫూత్కార మనియు మఱొకరు ఫీత్కారమనియుఁ జదివిరి.

47—88. విజయప్రారంభసంభారభాక్ । జాతో (తోఽ) జా

48—89. తరిపుః సమగ్రపృతనామె (మే) లాపనె (నే) యో

## తూర్పునైపు.

1—90. జితః [1] సద్యస్సజ్జబలాన్వితః ప్రముదితశ్శ్రి । (శ్రీ)ఘంశ్రియై

2—91. నిర్గ (ర్గ) తః॥ [౨౧]. [శా]. యస్యోద్యద్విజయప్రయాణ సమయె (యే) గంభి (భీ) ర

3—92. ఘె (ఘే) రి (రీ) భవద్భాంకారొ (రో) ద్భవ సంభ్రమ వ్యతికర వ్యాజృంభణొ (ణో) దె్వ (దే)

4—93. గతిః। భిశ్యంత్యభిచయా శ్చలం త్యవనయో భ్రామ్యః త్యమి (మీ) భూ

5 94, ధరాఃకూమ్మ (ర్మా)ః క్నా * (క్రౌ) మ్యతి ముహ్యతి ద్విరసనః కుంఠన్తి దిక్కుంజరాః॥ [౨౨].

6—95. [స్రగ్ధరా]. కొ (కో) శాస్గై (గ్లై) హె (హే) ష్వముంచ న్వధిక రితురగా న్బాంధవా నర్ధ (ర్ధా) మార్గె (ర్గే) [1] దుర్గె (ర్గే)

7—96. వ్వ(ం)తఃపురాణి ప్రతిరవచకితా రుద్రదె (దే) వస్యభి (భీ) త్యా యస్యో

8—97. ద్యోగె (గే) భ్ర మంతస్సమయ సమారంభగంభి (భీ) రభె (భే) రి (రీ) భాంకారా

9—98. కి (కీ) ర్ణ్ణా (ర్ణా) కర్ణ్ణా (ర్ణా) జ్వరభరతరలాఃప్రె (ప్రే) క్షితాశాః క్షితి (తీ) శాః॥ [౨౩]. [వసం]. గత్వా జవా

10—99. (త్రి) చతురాణి పదాని రాజా । సస్యస్యఖండనమివ ప్రథమాహుతిం

---

* క్షా అని ఫ్లీటుగారి పాఠము. క్షామ్యతియను నర్ధ మిక్కడ నెట్లు బాసగునో? క్రౌమ్యతియను మా సవరణయు నంత తృప్తికరమైనదికాదు.

11—100. వా। భ్రూభంగవి (వీ) క్షణవివర్ధి (ర్ధి) తకో (కో) పపహ్నా
య ద్వర్ధి (ర్ధి) మానన

12—101. గరి (రీ)ం ప్రథమం జుహా వ॥ [౨౪]. [వసం]. యస్యాక్షి వి (వీ)
క్షణ భయాచ్చకితే స్స భి (భీ)

13—102. మో [।] దురియో (యో)ర్ధ (ర్ధ) ధనస్య నృపతె (తే) రివ విహ్వలాం
గః। స్వభ్రాతృమా

14—103. తృవనితాసహితస్సమగ్రలక్ష్మి (క్ష్మీ)ం। విహాయ వనమె (మే) వ య

15—104. యౌ విలజ్జః॥ [౨౫] [వసం]. తస్మిన్ గతో (తోఽ) నుజగామ
దదావా [।] రాజా చో (చో) డో (డో) దయ

16—105. స్యనగరి (రీ) మగరి (రీ) యసి (సీ)ం తాం। లంకా మివా మరపురి
(రీ) సదృశి (శీ)ం మృగాక్షి (క్షీ) [।] శ్రే (శ్రే) ణి (ణీ) విలా
సలలితామి

17—106. వ చాంజనె (నే) యః॥ [౨౬]. [అనుష్టు. శ్లో]. లులావచవసంత
స్య దుర్గ (ర్గ) మర్గ (ర్గ) శవిభ్రమం। తడాగ మకరో
(రో) త్ర పురమధ్యె (ధ్యే) మ్బు

18—107. తం మహత్॥ [౨౭]. [శా]. కందూరోదయచో (చో) డవంశ
విలస గ్ధి (గ్ధీ) రాబ్ధి (బ్ధి) గర్భోర్భ (ర్భో) ద్భవ త్వద్భై కాత్ర
యరుద్రదె (దే) వ నృప

19—108. తె (తే)ః కిం వర్ణ్య (ర్ణ్యా) తె (తే) వ్రిక్రమః [।] క్షుద్రక్ష
త్రకులో (లో) న్నతిక్షయకృతః సర్వా (ర్వా) వనిశ్రి (శ్రీ)
భృతో (తో) [।] రామస్యె (స్యై) వ

20—109. కుఠారఖండితరిపు వ్రాతస్యపృధ్వి (థ్వీ) పతె (తే)ః॥ [౨౮]
[శా]. రంగత్తుంగతుర [ం] గం *(గ) పుంగవఖురక్షుణ్ణ (ణ్ణ)ం
జగన్మండలం

21—110. జ్యోత్స్నోల్లాసి సదాతపత్రనికరవ్యాప్తింనభో (భో) మండలం।
పూర్ణే (ర్ణే)ంమాత్కరచారుచామరచయొద్ది (ద్ది)

* ఇక్కడ సున్న ముందుపడవలసినది తరువాత పడినది. (జా. పా.)

22—111. జ్మండలం సంభృతం [।] దృష్ట్వాసైన్యవినిర్గ (ర్గ) మంనర పతె (తే)ః ప్రాదుస్రుమ (వు) శ్శత్రవః ॥ [౨౯]. [శా]. కాంచి (చీ) మండలవింధ్య

23—112. మధ్యనిలయాభి (భీ) మాదయఃపార్థి (ర్థి) వా [।] యస్య శ్రో (శ్రో) త్రపథంగతా అహరహః శ్రి (శ్రీ) రుద్రదె (దే) వస్య

24—113. తె (తే) । దృష్ట్వె (ష్ట్వై) † వానిమిషా బ భూవురమరీవర్గా (ర్గా) స్సమత్యాశ్చిరం [।] ప్రత్యావృత్త్యళమె (మే) వరుద్ర నృప

25—114. తింద్రాపాప్తాశ్వరణ్యార్థి (ర్థి) నః ॥ [౩౦] [శా] రుద్రంస్వామి నర (రే) శ్వరంబుధశతానె (నే) కంద్రియో భాజనం కృత్వాయః

26—115. స్యకదాపిచె (చే) తసిముదాశంకాన సంక్రామతి । ఎ (ఏ) కంశ్రి (శ్రీ) పురుషొ (షో) త్తమంకలకలైః కృత్వాశ్రియో

27—116. భాజనం [।] వి (వీ) చి (చీ) నాంకురుతె (తేఽ) ధునాపివసుధా ముజ్జాగరాం సాగరః ॥ [౩౧]. [శా]. న్యగ్భూతీకృతరాజహం

28—117. సనికరఃపద్మో (ద్మో) ద్భవైకాశ్రయః [।] శ్రి (శ్రీ) రుద్రశ్చతు రాననో బుధవరానందైకహె (హే) తుర్భ్రశం [।]

29—118. నానాశాస్త్రవిచారణైక చతురో (రో) బ్రాహ్మి (హ్మీ) విలా సాశ్రయః [।] కల్పాకణ్పగతిఃక్షితా

30—119. విహశతానందస్వ (స్వ)ం• య (ం) పార్థి (ర్థి) వః॥ [౩౨] [శా] సత్యాసక్తమనా నిరస్తనరకక్లె (క్లే) శశ్చలక్ష్మ్యాశ్రయః[।]

† దృష్ట్వైవా అని చదువవలెను.

• ఇక్కడనున్న 'య' తరువాత పడుటకు మారుగా 'స్వ' తరువాత పొరపాటున లేఖకుఁడు వ్రాసినాడు.

31—120. పృథ్వి (ద్వీ) భృద్యదనంతం * భో(భో) గ నిలయః శశ్వద్వి (ద్వి) జె (జే) ం ద్రప్రియః । దుష్టారిష్ట † విమర్ద (ర్ద) నస్సు

32—121. మనసామర్థ్యర్థి (ర్థి) తార్థ (ర్థ), ప్రదో (దో) [।] గో (గో) త్రప్రా (ప్రో) ద్ధరణః సుదర్శనకరో (రో) రుద్రస్వ (స్వ) యం కె (కే) శవః॥ [౩౩].

33—122. [మాలిని] అసమసమరసంగో (గో) త్తుంగమాత [ం] గకు (ం) భ [।] స్థలవిగళిత ముక్తాహారభారాభిరామః భవ

34—123. భవభయభఙ్త్తో (ఙ్త్తో) భామిని (నీ) శవ్యనె (నే) త్రా (త్రో) త్ప లదలచయభూషణః శో (శో) భతె (తే) రుద్రదె (దే) వః॥ [౩౪] [వసం] అస్మి

35—124. న్నృశాసతిమహీ (హీ)ంభువిరుద్రదె (దే) వె (వే) [।] రాజ (జా) భిధాశశిని నైవనరో (రో) త్తమె (మే) షు [।] ఈశత్వమిందుతి

36—125. లకె (కే), సధనాకులె (లే) షు [।] తె (తే) జస్వితాదినకరె (రే) నచశాత్రవె (వే) షు॥ [౩౫]. [వసం]. కె (కే) శగ్రహస్ఫురతే సంగరసంభ్ర

37—126. మె (మే) షు [।] దండగ్రహోయతిషు నైపజనోత్కరె (రే) షు । శాస్త్రె (స్త్రే) వివాదకథనం వ్యవహారజన్మే [।]

38—127. నక్వాపిమష్టమథనం మధనంత్వరణ్యాం ॥౩౬॥ [శా] దానందైన్య పరాభవావధిరిపుచ్ఛె (చ్ఛే) దావధిర్వి (ర్వి) క్ర

39—128. మ [।] శ్చాతుర్య్య (ర్య)ంచతురాననావధి గుణగ్రామ స్త్వ సంఖ్యావధిః । తె (తే) జోభాస్కరతాపనా

* ఇక్కడ సున్న జాతిమీద లేఖక ప్రమాదము వలన పడినది.

† అరిష్టుఁడను రాక్షసుఁడు వృషభరూపము ధరించి శ్రీకృష్ణునిచేఁ జంపబడెను.

40—129. వతియశో (శో) గాశిస్తురుద్రస్యాయ [।] స్త్రైలా (లో) కృక్ర మణావధిన్నిః (నిః) రవధిర్ధిః (ర్ధః) మేః (మేః) మతిఃశో (శో) * భతె (తే) ॥ [౩౭]

41—130. [శా] ప్రాప్తాశో (శో౽) పిమహ త్తరో (రో౽) పిమహతామె (మే) కాత్రయో (౽) పిత్రియో [।] జన్మస్థానమపిప్రసంన † హృ

42—131. దపిత్వంరల్నధామాపిసన్ [।] పి (పీ) తఃసంభసముద్భవె (వే) నజలధి (ధే!) క్షారఃసముద్రో (ద్రో) యతో (తో) [।] సై

43—132. వంరుద్రనరె (రే) శ్వరో (రో౽) యమమునాస్పర్ధాః (ధాః?) వృథామాకృథాః ॥ [౩౮]. [శా] కౌదార్యాః (ర్యః) ంసుర శాఖినఃశ

44—133. ఖరిణః స్వణ్ణాః (ణాః) కృతె (తే) గ్గాః (గ్గాః) (గాః) రవం [।] సైర్యాః (ర్యః) ందాశరథె (థే) బ్బః (బః) లం పురభిదో (దో) గాంభి (భీ) ర్యాః (ర్యః) మంభో (భో) నిధి(ధే) ః [।]

45—134. సౌందర్యాః (ర్యః) ంమకరధ్వజాత్సురగురో (రో) ర్విః (ర్విః) ద్యారతింకాతుకా [।] దాదాయాబ్జసముద్భవె (వే) నర

46—135. చితం ♦ శ్రి (శ్రీ) రుద్రదె (దే) వో (వో) ధ్రువం ॥ [౩౯] [శా] (ః) స్నాయత్రైరవతి (తీ) ంమరంబుజపతిః స్పష్టాంబుజత్యం బరం [।]

47—136. లో (లో) లంని (నీ) లసరో (రో) జలిస్ఫుటయశో (శో) మగ్ధో (గ్ధో) దధాసంప్రతి । జ్యోతి (తీ) ంషిస్ఫుటబుద్బుదంలిహారి

48—137. తఃకూలంతిలో (లో) కాత్రయ [।] శ్చంచద్వి (ద్వీ) చిచయం తియస్యజయతి శ్రి (శ్రీ) రుద్రదె (దే) వో (వో) మ్బలెం ॥ [౪౦]

---

* మతిశ్శోభతే అని చదువవలెను.

† ప్రసన్న అని ఇప్పటిచ్రాత.

♦ తః అని డాక్టరు ఫ్లీటు సవరించినాఁడు.

49—138. [శా] పాదన్యాసశిలాశ్శిరాంసిసమరె (రే) కృత్తానిఖడ్గె (డ్గై) నయ [।] చ్ఛత్రూణాం పలితానిమాంసవి

50—139. లసత్పంకె (కేఽ) ధశంకె (కే) హ్యాహం। రక్తస్రో తసిరుద్రదె (దే) వజయినోన్నత్యత్కబంధాః ప్లవా [।] అ

51—140. యాంత్యావిజమశ్రియశ్చసవిధంకి (కీ) ర్తేః (ర్తేః)ః ప్రయాం త్యాదిశః ॥ [౪౧]. [శా]. తస్యాస్తె (స్తేఽ) నుమకొండనా

52—141. మనగరి (రీ) శ్రి (శ్రీ) రాజధాని (నీ) వయా [।] యత్రో (త్రో) ద్య * దఖండ ఖండపరశువ్యాజృంభణో (ణో) జృంభితా

53—142. కందర్పస్యపురి (రీ) వసారతిమతి (తీ) శృంగారభావాన్వితామా (హే) ంద్రి (ద్రీ) వచజిష్ణు విష్ణుప

54—143. హితారంభావిలాసోర్జ (ర్జి) తా॥ [౪౨]. [వసం]. యత్ర స్త్రీయోమకరకె (కే) తనరాజధాన్య [।] ఆని (నీ) లని (నే) ర

55—144 జప (ఫ) లాశదృశః కృశాంగ్యః। త్రైలో (లో) క్యసుందరదృ శాంతిలకాయమానా [।] ఆపీనతుంగ

56—145. కుచకుంభభరాలసాంగ్యః ॥ [౪౩]. [వసం]. యత్రద్విజె (జేం) ద్రభవనె (నే) షునివార్యమాణాః [।] కి (కీ) రాః

57—146. పఠంతిపటవో (వో) పటుభిస్సమె (మే) తాః। సర్వాణ (ర్వాణ)ం గసంగత సమస్తవిచారచారు చారిత్ర

58—147. చర్చ్చితపదక్రమయుక్తవె (వే) దాన్ ॥ [౪౪]. [వసం] వె (వే) శ్యాగృహె (హే) షుజాసురతో (తో) త్సవజాతచె(చే) ష్టా [।] శబ్దా

59—148. నుకారిశుకశాబ † కలో (లో) రుళబ్దాః। సర్వాణ (ర్వాణ) ది శో (శో) ముఖరయన్తి దివానిటానాం [।] కం

---

* సదఖండ అని ఫ్లీటుపాఠము.

† వ అని ఫ్లీటుగారి సవరణ.

60—149. దప్ప్ర (ర్ప) దప్ప్ర (ర్ప) తరలాణ్ణ్ర (ర్ణ) వపూణ్ణ్ర (ర్ణ) చంద్రాః ॥ [౮౫]. [శా]. నాతిక్రామతిపైష్ణవం పదమితి ద్యాం

61—150. గౌరితిత్స్మామిమాం [।] సాదై (ః) ప్రత్యుతినోతురంగమచయః శ్రి (శ్రీ) రుద్రదె (దే) వస్యయః [।]

ఉ త్త ర ము నై పు.

1—151. సవ్వా (ర్వా) శాఃపరిపూర యన్విజయతె (తే) న్ప

2—152. త్యై (త్యై) నసంభి (భీ) షయం [।] చ్ఛత్రూన్యుర్ధ (ర్ధ) మహి (హీ) త

3—153. లె (లే) ప్రతిదినం విద్రా వయన్మారయన్ ॥ [౮౬]

4—154. [మాలిని] అతి రమణశరి (రీ) రాయె (యే) చని (నీ) చస్వరా

5—155. డ్యా (ఢ్యా) స్సకల తురగ శాస్త్రోద్భాసిసల్ల

6—156. క్షణాఢ్యాః । జవభర భరితాంగాస్సత్వ

7—157. సంపన్నగాత్రా [।] అతిచిర తరజి (జీ) వాః

8—158. పంచధారాస్తురంగాః ॥ [౮౭] [మందా] రాజ్యం పాజ్యం * ల

9—159. వణజలధె (ధే) స్తి (స్త్రి) రపయ్యా (ర్యా) న్తమస్య [।] శ్రి (శ్రీ)

10—160. శైలాంతాం ప్రచరతి సదాదక్షిణాశాం

11—161. సమగ్రాం । ప్రాతి (తీ) చ్యాన్తా కటకనికట

12—162. స్థాయిని (నీ) రాజ్యలక్ష్మి (క్ష్మీ)ః [।] కాబె (బే) య్యా (ర్యా) శా

13—163. తటవిలసితె (తే) మాల్యవన్తం ప్రదె (దే) శె (శే) ॥ [౮౮] (రథోద్ధతా). అ

---

* ప్రాచ్యాం అని యుండిన బాగుండును

14—164. చ్చర్గ (చర్గ) నార్థ్గ (ర్థగ) మిహాదత్తవాన్మ హాన్మద్ది † చెఱువు
15—164. లఖె (ఖే) టకం। శ్రి (శ్రీ) మహె (హే) శరవిశారిణ
16—165. స్థిరం [।] రుద్రదెవ (దే) వ నృపతిమ్మర్గ (మర్గ) తస్సతాం ॥ [౪౯]



† మట్టి చెఱువులని ఫ్లీటుగారి పాఠము

# మూలము - అనువాదము



ఓం

స్వస్తి. శ్రీర్విజయ శ్చాభ్యుదయశ్చ భవతు. స్వస్తిసమ ధిగత, పం[1] చమహాశబ్ద, మహామండలేశ్వర, అన్మకుండా[2] పుర వరేశ్వర, పరమమాహేశ్వర, పతిహితచరిత[3] వినయవిభూష ణం, శ్రీ మన్మహా మండలేశ్వర కాకతీయ రుద్రదేవరాజుల[4] విజయరాజ్య ముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధమాన మా చం ద్రార్కతారము [గా],[5] అన్మకొండ పట్టనము నందు సుఖ సంకథావినోదంబున రాజ్యంబు సేయుచు నుండ, శకవర్ష ములు ౧౦౮౪ వునేంటి చిత్రభాను సంవత్సర మాఘ శు ౧౩ వడ్డవారము నాండు,[6] తనపేర రుద్రేశ్వరమును, శ్రీవాసు దేవర శ్రీసూర్యదేవరాను[7] ప్రతిష్ఠసేయించె. ౧. [ప 1-8]

---

1 సున్న యక్షరమునకుఁ గుడిప్రక్కనుండైన వ్రాయఁబడినది. ఇట్లే మఱి కొన్నిచోట్లను గలదు.

అర్థము :— క్షేమము, లక్ష్మియు, విజయము, అభివృద్ధియుఁ గలుగు గాక ! స్వస్తిసమధిగత.............వినయవిభూషణం (మొదలగు) బిరుదులు గల శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ రుద్రదేవమహారాజుల విజయముతోఁ గూడికొనిన రాజ్యమానాఁటి కానాఁడు సూర్యచంద్రు లున్నంత కాల మభివృద్ధి చెందుచుండు నట్లుగా, అనుమకొండ పట్టణంబునందు సుఖముగా మంచికథలతో వినోదముగాఁ గాలక్షేపము చేయుచుండగాను, శాలివాహన శకము ౧౦౮౪ వ నాఁటి చిత్రభాను సంవత్సర మాఘ శుద్ధ త్రయోదశీ శనివారమునాఁడు తనపేర రుద్రేశ్వరలింగమును (వేయి స్తంభాలగుడిలోని పడమటి వైపు గుడి) విష్ణుదేవుని (ఉత్తరము వైపు), సూర్యదేవుని* (తూర్పువైపున) బ్రతిష్ఠ చేయించెను.

---

2 అన్మకుండా, అని దీర్ఘాంతముగా నీపదము ప్రయోగించుటచింత్యము
3 పతిహితచరిత, అను బిరుదువచనము త్రిభువనమల్ల బేతరాజునకు గలదియే రుద్రదేవునకును వాడఁబడినది.
4 ల యను, బహువచన రూపము గౌరవార్థము.
5 ఇక్కడ ఱాయిగొంట్లు పడినను 'గా' స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.
6 వడ్డవార మనగా శనివారము.
7 సూర్యదేవరను అని చదువ వలెను.

* సూర్యవిగ్రహము జైనమత ప్రీతికై రుద్రదేవుడు ప్రతిష్ఠించి యుండగా వీరశైవ మనుమకొండ యందు వ్యాపించు దినములలో నా విగ్రహమునకు బదులు ఇప్పుడున్న పానవట్టమును, తొలగింపఁబడి ప్రస్తుతము కానరాని లింగమును బ్రతిష్ఠింపఁబడి యుండును.

The entrance of Rudreswara's Shrine, Thousand Pillared Temple



వేయి స్తంభాలగుడి

రుద్రేశ్వరలింగము గలిగి పడమటివైపున గల

గుడి ద్వారము

శార్దూల విక్రీడితమ్

యస్యోత్తుంగ తరంగ తాడిత [వి] † యత్సప్తార్ణవీయంజలం,
పాదాంగుష్ఠ నఖాగ్రదఘ్న మభవద్భూమండలోద్ధారణే
దంష్ట్రాకోటి కుటీరకోటరగతం త్రైలోక్య మబ్బిందు వ
ద్బ్రహ్మాండా ఇవరోమకందనికరో ‡ వందేవరాహం హరిం, ౨.

[ప. 9—12]

అర్థము :— భూమండలమును (సముద్రమునుండి) పైకెత్తునపుడు, ఎత్తైన యలలచేఁ దాకఁబడిన యాకాశముగల సప్తసముద్రముల నీరు, ఎవని యడుగు బొటనవ్రేలి గోఁటికొన మునుఁగు నంతటి దాయెనో, లోకత్రయ మెవని దంతము కొన నుండు గుడిసెలోని యొక గుహను బ్రాప్తించిన నీటి బిందువు వలె (నుండె) నో, బ్రహ్మాండము లెవని (యొడలిమీఁది) వెండ్రుకల మూలదుంపల సమూహము వలె (నొప్పె) నో, (అట్టి) వరాహస్వరూపుఁడైన హరిని నమస్కరించు చున్నాను.

శ్రీహేరంబ! విలంబికుంతలమిలన్మల్లీదలత్కుట్మల
వ్రాతోజ్జృంభిత [గం*] ధలుబ్ధ మధుపధ్వానోత్కరస్యాస్పద [ః]
స్ఫీతప్రీతమనాభవ త్వ మిహ మే ది [గ్ద] ం • తిదంతద్యుతి
ప్రోద్దామోద్దలనైకవిక్రమలసద్దంతాంతకాంత్యాశ్రయః 3.

[ప. 12—14]

---

† వి ఉండుచోట ఱాయి పగిలినది. కాన యిది మేము చూచిన ప్రతిలోని పాఠము. ‡ 'నికరా' అని డాక్టరు ఫ్లీటుగారి పాఠము.
* ఇట్లు డాక్టరుఫ్లీటుగారు పూర్తిచేసినారు. • ఇచ్చట ఱాయి పగిలిపోయినది. కావున పూర్తిచేసిన అక్షరములు బ్రాకెట్టులో నుంచినాము.

అర్థము :—వ్రేలాడు ముంగురులతోఁగలసి, కొంచెము వికసించిన మల్లెమొగ్గల సమూహామునుండి, విజృంభించుచున్న సువాసన కాసక్తిఁ జెందిన తుమ్మెదలఝుంకారరచయమునకు స్థానమైన యో విఘ్నేశ్వరుఁడా! దిగ్గజముల దంతకాంత్యతిశయమునఁ నడ్డు లేని రీతిగా భేదించి వైచుట యందు ముఖ్యమైన పరాక్రమముచే నొప్పు దంతముల కొనయందలి కాంతికి నాశ్రయమైన నీవు, ఇప్పుడు నాకు వెల్లడియగుచున్న సంతోషసామ్రాంతుఁడ వగుమా!

వసంతతిలకా

[భూ*] తేప దుగ్ధలహరీభి రుదంచ తీవ
దుగ్ధోదధే రమృతదీధితినిర్మి తేవ
శ్రీఖండపిండ పరిపాండురపుత్త లీవ
వక్త్రే వస త్వవిరతం తు సరస్వతీ నః ॥ ౪ ॥

[ పం. 15–16 ]

అర్థము:—పాల తరంగముల చేతను గలిగినది వలెను పాలసముద్రము నుండి పుట్టినది వలెను, అమృతకాంతులతోఁ జేయఁబడినది వలెను, చందనపు ముద్దల యొక్క మిక్కిలి తెల్లనైన బొమ్మ వలెను, (నున్న) సరస్వతి మా ముఖము నం దెల్లప్పుడు నివసించుగాక!

---

* ఇక్కడ తాయిభిన్నమైనది. జా అని కొందఱిపాఠము. భూతేవ అనుట తాతిపాఠమునకు దగ్గర.

భారద్వాజకులశ్రియఃపరివృఢ[1]శ్రౌతక్రియాకర్మఠః,
శ్రీరామేశ్వరదీక్షితోజనయితాయస్యక్షితావగ్రణీః,[స్థయా
సోఽ[2]చింతేంద్రవరోఽ[3]ద్వయామృతయతేశ్శిష్యోయతి[3]శ్శ్న
శ్రీమద్రుద్రనరేశ్వరస్యసుమతేర్వంశావలీంవర్ణయే ॥ ౫

[ప 17—20]

అర్థము :—భారద్వాజగోత్రసంపత్తున కధినాయకుఁడును, యజ్ఞ యాగాది కర్మనిష్ఠుఁడును భూమిమీద ముందు నెన్నఁదగినవాఁడును నగు శ్రీరామేశ్వరదీక్షితుఁ డెవనికిఁ దండ్రియో, అచింతేంద్రవరుఁడను పేరు గలవాఁడను, అద్వయామృతయతికి శిష్యుడను, యతిని నైన యా నేను బుద్ధిశాలియైన రుద్రభూపతి వంశమును వర్ణించుచున్నాను.

ఆర్యావృత్తము

శ్రీమత్త్రి*భువనమల్లోరాజా కాకత్యవంశసంభూతః,
ప్రబలరిపువర్గనారీవైధవ్య విధాయకాచార్యః ॥ ౬

[ప. 20—21]

1 విసర్గములేదు. ద్విత్వశకారములేదు (తాతిమీద అనుట) ఫ్లీటుగారు విసర్గము పెట్టినారు.

2 ఇట్టిగుర్తు శాసనమందెచ్చటను లేదు.

3 ద్విత్వశకారము లేదు (తాతిమీద)

* తా వత్తు తాతిపాఠములో లేదు.

అర్థము :—బలవంతులైన శత్రువుల సమూహముయొక్క స్త్రీల (భార్యల)కు వైధవ్య మునాసాదించువిధానము బోధచేయువాఁడు (అయి) శ్రీమత్త్రిభువనమల్లుఁడను (బిరుదుగల) రాజు (ఒకఁడు) కాకతీయవంశమునం దుద్భవించినాఁడు.

శ్రీకాకత్యనరేంద్రబృందతిలకో వైరీంద్రహృత్తాపకః,
సత్పాత్రేవసుదాయకః ప్రతిదినంకాంతామనోరంజకః,
దుష్కాంతాచయదూషకఃపురహర*శ్రీపాదపద్మార్చకో
న్యగ్భూతీకృతనాయకస్త్రిభువనశ్రీమల్లదేవోబభౌ ॥ ౨

[ప. 21—24]

అర్థము:_శ్రీ కాకతీయ రాజవర్గమునందు శ్రేష్ఠుఁడును, శత్రురాజులమనస్సులకుఁ దాపము కలుఁగఁజేయువాఁడును, యోగ్యతకలవారికే ధనమునిచ్చువాఁడును, బ్రతిదినము (తన) భార్యలను సంతసింపఁజేయువాఁడును, పతివ్రతలుకాని స్త్రీలను దూషించువాఁడును, శివునిపాదపద్మంబుల నర్చించువాఁడును, తిరస్కరింపఁబడిన ప్రభువుకలవాఁడును నై త్రిభువనశ్రీమల్లుఁడు (త్రిభువనమల్లుఁడనుట) ప్రకాశించెను.

తత్పుత్త్రః శివపాదపద్మయుగళ ధ్యానామృతానందభూ,
ర్లుంఠాకో రిపుసుందరీ జనమహాసౌభాగ్యసంపచ్ఛ్రియః,
ప్రోలో*రాజఇతిప్రసిద్ధి మగమద్వైరీంద్రదర్పాపహో,
నిశ్శంకప్రథన ప్రబంధనమహాహంకారలంకేశ్వరః ॥ ౩ ॥

[ప 24—27]

* ప్రోలే అని డాక్టరు ఫ్లీటు గారి పాఠము. ప్రోలెరాజ అనియుండినచో గణముతప్పును.

అర్థము :—అతని కొమారుఁడు, శివపాదపద్మద్వంద్వముయొక్క ధ్యానమనెడి యమృతమువలన గలిగిన యానందమునకు స్థానమైనవాఁడును, శత్రువుల భార్యలయొక్క గొప్పనైన యదృష్టమును, ఐశ్వర్యమును, ధనమును నాశనము చేయువాడును, శత్రువుల గర్వ మణచువాఁడును, నిర్భయముగ యుద్ధము చేయుటయందు (నాయంత గొప్పవాఁడు లేఁడను) గొప్ప యహంకారముచేత రావణుఁడు అయిన వాడును (నై) ప్రోలరాజను పేరఁ బ్రసిద్ధిఁ జెందెను.

హస్త్యారోహణకర్మకర్మఠగతిం చాళుక్యచూడామణిం,
శశ్వద్యుద్ధనిబద్ధగహ్వరమతిం యుద్ధేభబంధక్షణాత్,
శ్రీమత్తైలపదేవమంబుదనిభ స్తంబేరమస్థంక్షణాత్,
ప్రఖ్యాతోరిపుకంఠ ఖండనవిధౌ భక్త్యానురాగాజ్జహౌ॥

[27—30 ప.]

అర్థము :—ఏనుగు నెక్కుటయను వ్యాపారమునందు నిష్ఠ కలవాఁడును, చాళుక్యరాజులలో శ్రేష్ఠుఁడును, ఎల్లప్పుడును యుద్ధమందుఁ దగుల్కొనిన గంభీరమైన మనస్సుగలవాఁడును, మేఘమువలె నల్లనైన యేనుగు మీద నున్నవాఁడును నగు శ్రీమత్తైలపదేవుని, శత్రువుల కంఠములను నరుకుటయను వ్యాపారమందు మిక్కిలి కీర్తిగలవాడు (ప్రోలరాజు) క్షణములోఁ బట్టుకొని, (అతనిమీది) భక్తిచేతను, ప్రేమవలనను విడిచిపెట్టెను.

యః ♦ కుంతోరి ప తేరకుంతపరశుశ్లక్ష్ణాగ్రధారోల్లస
ద్ధారాపాతనిపాతనైకచతురం [గో]*విందరాజాహ్వయం
బద్ధ్వోన్ముచ్యతదోదయక్షితి భృతేరాజ్యందదౌ లీలయా
లున్తాకోవిషయస్యతస్యసమరే సద్వీరదీక్షాగురుః॥ ౧౦ ॥
[ 30—33 ప. ]

అర్థము :—కుంతోరిదేశపు రాజుయొక్క మొక్కవోని గండ్రగొడ్డలి యొక్క తీవ్రమైన కొనవాడియం దొప్పుచుండు తెగ వేయఁబడుటను బడఁగొట్టుటయందు నేర్పుగల గోవిందరాజను వానిని యుద్ధమందుఁ గట్టివేసి, అప్పుడే (యా) రాజ్యమును, ఆతని రాజ్యమును నాశనము చేసినవాడును, చక్కనిదైన వీరవ్రతముచేత గొప్పవాడును (నైన) ప్రోలరాజు ఉదయరాజునకు సులభముగా నిచ్చివేసెను.

కృద్ధేనోద్ధురమంత్రకూటనగరీ ‡ నాథోఽథ యోనిర్త్రపో
గుండఃఖండితఏనముండితశిరాః క్రోడాంక వక్షస్థ్సలః,
ఏడోడింభకవత్పలాయనపరోజాతోగతస్స్వాంపురీ,[యత్
మాహాతోఽపిన్ర పేశ్వరస్యపురతః ప్రోలేన యుద్ధాయ
[ 33—36 ప. ]

---

♦ రో అని ఖాతిపాఠము. * గో అనుచోట ఱాయి పగిలిపోయినది.

‡ నగరీం అను ఖాతిపాఠములోని కడపటి సున్న తప్పని నే నూహించి యిక్కడ విడిచినాను.

అర్థము :—ఎవఁడు (ప్రోలరాజు) మున్దటను యుద్ధమునకుఁ బిలువబడియు గొఱ్ఱెపిల్లవలెఁ బాఱిపోవు నాసక్తిగలవాఁడు (అయి,) లేన పట్టణమునను వెడలిపోయెనో, ఆ సిగ్గులేని మంత్రకూట (మంథెన) నగరాధిపుఁడైన గుండరాజు, కోపముగల ప్రోలరాజుచేఁ దల గొఱిగింపఁబడి, వరాహముద్రగల రొమ్ముగలవాఁడై, చివరకుఁ దల గొట్టఁబడిన వాఁడాయెను.

అన్యచ్చానుమకొండ నామనగరీంసంవేష్ట్యయోయంస్థితో
నానామండలికాన్వితో భువి జగద్దేవ స్స దేవప్రభః,
స్తబ్ధ స్తంభిత ఏవ కార్యకరణేఽశ క్తః క్షణా న్నిర్గతః
శ్రీమత్ప్రోలనృపస్యతస్యజయినఃకింబ్రూమహేగౌరవం॥౧౨

[ 37—39 ప. ]

అర్థము :—వెండియు, నెవఁ డనేక మాండలిక రాజులతోఁ గూడినవాఁడై, అనుమకొండపట్టణమును చుట్టుముట్టి నిలిచెనో, భూలోకమున దేవతల గొప్పదనమువంటి గొప్పదనము కలవాడైన యాజగద్దేవుఁ డేమి చేయుటకును దోచనివాఁడయి, ప్రాన్పడి, క్షణములోఁ బాఱిపోయెను. జయశాలియైన శ్రీమత్ప్రోలరాజుయొక్క గౌరవమునుగూర్చి యేమి (యెంతని) చెప్పగలము!

దేవీముప్పమనామధేయ సహితాయస్యాగుణాస్తారకాః
కీర్తిశ్శారదచంద్రికేవ, విలసత్కాంతే స్తునైవోపమా,
కౌసల్యేవ చ, జానకీవ చ, సతీ కు న్తీ*వ, పద్మేవ సా
పౌలోమీవ చ, చండికేవ చ, వరాతస్యాభవద్భామినీ॥

[పడమటి వైపు 40—41 ద. 1—2 ప.]

---

* ఇక్కడ కుంతీయని వ్రాయు నాచారమువిడిచి వర్గాంతమైన యను నాసిక్యముతో గలిపి వ్రాయఁబడినది. 'కున్తీ' అను పదమువఱకు పడమటి వైపు దాయు 41 వ పఙ్క్తితోఁ బూర్తియైనది.

అర్థము :—ఎవతె (సు) గుణములు తారకలో, కీర్తి శరత్కాల చంద్రికయో, ప్రకాశించు కాంతికి సాటిలేదో ముప్పమ్మ యను పేరు గల యా దేవి, కౌసల్య వలెను, సీత వలెను, పతివ్రతయైన కున్తి వలెను, లక్ష్మి వలెను, ఇంద్రాణి వలెను, పార్వతి వలెను, నతనికి (ప్రోలరాజునకు) ఉత్తమురాలైన భార్య యయ్యెను.

త*స్యాస్తస్యసుతోఽజనీహ పరమానంద్రైక కందాంకురః, కామఃకిం, నలకూబరశ్శివసుతస్స్కందోజయంతోఽథవా, జిష్ణుర్వ్రజధరోఽథవా హరిరయం ద స్రీకుమారౌ; న తే భక్తశ్శ్రీగిరిశే, హితాయ జగతశ్శ్రీ రుద్రదేవోన్నృపః॥౧౮.

[ద. వై. 2–8 ప.]

అర్థము :—గొప్పదైన యానందమనెడి మూలదుంపకు మొలకయైన శ్రీ రుద్రదేవరాజు, మన్మథుఁడాయేమి? నలకూబరుఁడా? శివుని కుమారుఁడా, (గణపతియా) కుమారస్వామియా, జయంతుఁడా లేక యర్జునుఁడా, ఇంద్రుఁడా లేక యితఁడు హరియా, అశ్వినికుమారులా?—వారెవరును కాదు—లోకోపకారార్థమై శ్రీశైలాసాధి పతియందు భక్తుడు (అయి) యా మెకును (ముప్పమ్మకును) యతనికిని (ప్రోలరాజునకు) నీలోకమున కుమారుఁడయి జన్మించెను.

త్వంగత్తుంగ తురంగ పుంగవచయారో హ్రక్రమేకర్మఠం, డొమ్మంచారుపరాక్రమక్రమభరం భజ్క్ర్యాసకృల్లీలయా, కర్ణంపార్థ ఇవామత్తైశ్శరశతైర్విద్రావ్య, విద్రావ్య, మో లేఖేసర్వవిశేషయుక్త నగరగ్రామం స రుద్రోన్నృపః ॥౧౯.

[ద. వై. 8–14 ప.]

* లేవలె రాతిమీద గానవచ్చును. కాని అట్లుండుట తప్పగును.

అర్థము :—చలించుచున్న యశ్వశ్రేష్ఠములయొక్క సమూహము నెక్కుటయను వ్యాపారమందు నియమముగలవాఁడును, చక్కని శౌర్య పరాక్రమముయొక్క భారము కలవాఁడునునగు డొమ్మరాజు నొక్కసారి సులభముగా నోడించి, కర్ణునిఁ బార్థుఁడు వలెనే నూర్లకొలది బాణములతో (నతనిని) బాఱఁదోలి, పాఱఁదోలి, యా రుద్రదేవరాజు సమస్త పరికరము లతో గూడికొని యున్న యతని పట్టణముల సమూహమును బొందెనుఁ (స్వాధీన పరచుకొనెను.)

ఈడే మేడవిడంబడంబరభరక్షోదక్షమం క్ష్మాభృతాం,
దుర్వారోద్ధురవీరమంత్రసమయా దానైక దీక్షాగురుం;
శ్రీమన్నైమ్మలిగిదేవసంగసమయ ప్రోద్భూతదర్పాపహం,
ప్రాప్తశ్రీపొలవాసదేశవిభవం శ్రీరుద్ర దేవం సదా॥౧౬॥

అర్థము :—మేడరాజుయొక్క మోసపుచ్చుటయందలి గర్వాతి శయమును పలుచగాఁజేయ సమర్థుఁడును, రాజులయొక్క నిరర్గళమైన యతి శయమైన వీరుల మంత్రదీక్షను లాగికొనుట యను నియమముచే గొప్ప వాఁడును, శ్రీమన్నైమ్మలిగి దేవుని యుద్ధసమయ మందుఁ గలిగిన శౌర్య గర్వమును హరించిన వాఁడును, పొందఁబడిన శ్రీ పొలవాసదేశవైభవము కలవాఁడును నైన రుద్రదేవుని స్తుతించుచున్నాను.

వసంతతిలకా

భీమేన భీమ నకులేన కులేన హీనో *
గ్రస్తో మమార గృహమూషక వత్తృణేన
మార్జారడింభకవరేణ మహాంధకారే
గోకర్ణనామభుజగో భువి శూరమానీ॥ ౧౭.

[ద. పై. ప. 20–24]

అర్థము :—గొప్పచీకటియందు గొప్పదైన పిల్లిపిల్లచే నింటియెలుక వలె, భూలోకమందు శౌర్యాభిమానములు గలవాడును, కులమందు గొప్ప వాడును నగు గోకర్ణుడను సర్పము భీముడను భయంకరమైన ముంగిసచే బట్టు కొనబడి తత్త్రణమే మరణించెను.

శ్రీమద్రుద్రపరాక్రమోద్భవభయవ్యామోహనాఖ్యోల్లస
చ్ఛస్త్రత్రస్తసమస్తగాత్రవిలసచ్చోడోదయక్ష్మాపతేః
ఉన్మత్తా ఇవ, విస్మృతా ఇవ, మహాభూతాభిభూతా ఇవ,
ప్రోద్భ్రాంతా ఇవ, సంకులా ఇవ తదా ప్రాణాః ప్రయాతా దివం॥

[ద. పై. ప. 24–30]

అర్థము :—శోభాయుక్తుడైన రుద్రదేవరాజు యొక్క పరాక్రమము వలన గలిగిన భయ మనెడి వ్యామోహ మను పేర నొప్పు శస్త్రము వలన వణకు చున్న సమస్తశరీరము గల చోడోదయరాజు యొక్క ప్రాణములు

---

* డాక్టరు ఫ్లీటుగారు కులేన హీనో అని జనని యర్థము వ్రాసిరి. ఇది గోకర్ణునికి విశేషణము కాబట్టి కులముచేత హీనుడని ఫ్లీటుగారు అర్థము చెప్పుట సమంజసముగా లేదని తోచెడిని.

పిచ్చిపట్టిననివలెను, కళతప్పినదివలెను, గొప్ప పిశాచముచే బాధింపఁబడినదివలెను, భ్రాంతిమంతమైనదివలెను, చెదరిపోయినదివలెను, అప్పుడే స్వర్గమునకుఁ బోయినవాఁడాయెను.

వసంతతిలకా

యాతేఽపి తైలపనృపే దివ మస్య భీత్యా
సర్వాతిసార కబలీకృతగాత్రయష్టౌ
శ్రీరుద్రదేవనృపతేః పృథువిక్రమస్య
భీమోఽపి రాజ్యపదవీం క్షణికాంసలేభే॥ ౧౯.

[ద. వై. పం 30—34]

అర్థము:—గొప్ప దైన పరాక్రమము గల యీ రుద్రదేవరాజు యొక్క (వలని) భయముచే, అతిసారరోగముచే నంతటను గబళింపఁ బడిన (కట్టె వంటి) శరీరము గల తైలపరాజు స్వర్గమునకుఁ బోగా (పరమపదింపగా) ఆ భీముఁడును (తైలపుని) రాజ్యపదవిని క్షణకాల మనుభవించెను.

ఏకోజంబుకడింభకో లఘుతరై స్సంవేష్టితో[1] జంబుకై,
రాజాఽహంకృతి ధి[2]క్కృతక్షితితల స్సింహేనసంస్పర్ధతే
(ఫే[3])త్కారాకుళగర్జితైర్ముఖరయ న్సర్వాదిశోవిహ్వలో
యాతః క్వాపిసటావిధూననభ[4]రైః కంఠీరవస్యాతురః॥ ౨౦.

(ద. వై. ప. 34—39)

---

1 తో తరువాతసున్న ఉండుట లేఖకప్రమాదము (జాతి పాఠము)

2 ధిక్కృత అనుచోట కాక ద్విత్వములేదు (జాతి పాఠము)

3 ఇచ్చట జాయిపోయినది. ఫీత్కారమని యొకరు, ఘూత్కారమని యొకరు వ్రాయుచున్నారుకాని కొంతకొంత కానవచ్చుచున్న జాతిమీద యక్షరమునుబట్టి యది ఫేవలెనున్నట్లు మాకు గోచరించినది.

4 చ, భ, ఒకలాగుండునుగాన పాఠనిర్ణయము కష్టము.

అర్థము :—ఒకనక్కపిల్ల (తనకంటె) చిన్నదైన నక్కలతో చుట్టు కొనఁబడిన దయి "నేనురాజు" నను నహంభావముచేతఁ దిరస్కరింపఁ బడిన భూమండలము గలదయి సింహముతోఁ బోటీపడుచున్నది. (కాని) సింహముయొక్క పూత్కారముచేతనే భయకంపితములైన గర్జనలతో సర్వదిక్కులను ధ్వనింపఁజేయుచు, భీతి జెందినదియు, (సింహముయొక్క) విసరుటలయొక్క భారములచే తొందరపాటును గలదియు, (నగుచు) నెక్కడికో పోయినది (అగును).

తద్వద్భీమనృపాధమో నరపశు ర్మాతు స్స పత్నీపతి
ర్హంతా భ్రాతృవరస్య భోజనవిధౌ భీమేన సంస్పర్ధతే
ఆకాశగ్రసన ప్రయాసనిరత శ్రీరుద్రదేవేన య
త్స్పర్ధావర్ధిత గర్వపర్వతమహాశృంగాగ్ర మారోహతి॥ ౨౧.

[ద. వై. 39_44 ప.]

అర్థము:—ఆ రీతిగానే, మనుష్యుఁడనెడి మృగమైన వాఁడును, సవతి తల్లికిఁ బెనిమిటి యైన వాఁడును, భోజనకాలమందు సోదరునిఁ జంపిన వాఁడును, నగు భీమరాజను నీచుఁడు, ఆకాశమును మ్రింగివేయు టనెడి కష్ట మందాసక్తి గల వాఁడై, ఎవనితోడి స్పర్ధచేత వృద్ధి పొందింపఁబడిన గర్వ మనెడి పర్వతముయొక్క కొమ్మకొన భాగము నధిరోహించుచున్నాడో అట్టి భయంకరుఁడైన రుద్రదేవునితో స్పర్ధ (పోటీ) ను బెట్టుకొనుచు న్నాఁడు.

శ్రుత్వాభీమనృపస్య రాజ్యవిభవం చారైశ్చ దుశ్చేష్టితం,
శ్రీమదుద్ర నరేశ్వరో౽గ్ర విజయప్రారంభ సంభారభాక్,
జాతో౽జాతరి పు స్సమగ్రపృతనా మేలాపనే యో ‡ జితః
సద్యస్సజ్జబలాన్వితః ప్రముదిత శ్శీఘ్రం శ్రియై నిర్గతః॥ ౨౨.
[ద. వై. 45-48 ; తూ. వై 1-2]

అర్థము :—చారులచేత భీమరాజు రాజవైభవమును, అతని కుచేష్ట యును విని, అనంతరము విజయప్రారంభమునకుఁ గావలసిన సామగ్రి కల వాఁడును, అజాతశత్రువయిన వాఁడును, సంపూర్ణమగు సేనను సమకూర్చు కొనుట యందు నేర్పాటు గావించుకొనిన వాఁడును, అప్పటికప్పుడు సిద్ధ మైన సేనతోఁ గూడికొన్నవాఁడును, సంతోషము కలవాఁడును నగు రుద్ర దేవరాజు వెంటనే సంపత్తుకొఱకు బయలుదేరెను.

యస్యోద్యద్విజయ ప్రయాణసమయే గంభీరభేరీభవ
ద్భాంకారోద్భవ సంభ్రమవ్యతికర వ్యాజృంభణోద్వేగతః
భ్రశ్యంత్యభ్రచయాశ్చలన్త్యవనయో భ్రామ్యంత్యమీభూధరాః
కూర్మః క్రామ్యతి,* ముహ్యతిద్విరసనః, కుంఠన్తి ♦ దిక్కుంజరాః
[తూ. వై 2-5 ప.]

---

‡ ఇక్కడకు ద. వైపు పూర్తియైనది.

* 'క్రామ్యతి' లో 'కా' క్రింద క్రావడి తాటిమీద సరిగాలేదు. సా పత్తువలె గాన వచ్చుచున్నది.

♦ తాటిమీద నిల్లే యున్నది. (న్తి) అని.

అర్థము :—ఎవని (ఏ రుద్రరాజు యొక్క) యుద్యమించుచున్న నిజ యమునకై పోవు సమయమందు గొప్ప ఢంకాలనుండి పుట్టినధ్వని వలన గలిగిన తొందరపాటుతో గలిసికొనుటచేత నైన విజృంభణముయొక్క భయమునకు, మేఘసమూహములు జారిపడుచున్నవో, లోకములు కదలి పోవుచున్నవో, ఈ కులపర్వతములు తిరుగుడు వడుచున్నవో, ఆదికూర్మము తొలగిపోవుచున్నదియో, ఆదిశేషుఁడు మూర్ఛవోవు చున్నాఁడో, దిగ్గజ ములు భ్రంగిపోవుచున్నవో (ఈ శ్లోకమును ౨౧ వ శ్లోకముతో అన్వయిం చుకొనవలెను.)

స్రగ్ధరావృత్తము

కోశాన్గేహాన్వ్యముంచన్పథి కరితురగాన్బాంధవా నర్ధ మార్గే
దుర్గే ష్వంతః పురాణి ప్రతిరవచకితా రుద్ర దేవస్య భీత్యా
య స్యోద్యోగే భ్రమంత స్సమసమయసమారంభగంభీరభేరీ
భాంకారాకీర్ణ కర్ణజ్వరభరతరలాః ప్రేక్షితాశాః క్షితీశాః॥ ౨౮.
[తూ. పై 6-9 ప.]

అర్థము :—ఎవని ప్రయాణమునందు, శత్రురాజులు ప్రళయకాలపు టారంభమునందలి గొప్ప ఢంకాల చప్పుళ్లచేత వ్యాప్తమైన కర్ణజ్వరము యొక్క భారముచేత జలించినవారయి తిరుగుడు వడుచున్నారో ఆరుద్ర దేవుని భయముచేతనే, ధనములను నిండ్లయందును, మార్గమధ్యమున నేనుగు లను గుఱ్ఱములను బంధువులను, దుర్గములం దంతఃపుర స్త్రీలను, విడచి పెట్టి ప్రతిధ్వనుల చప్పుళ్లకు జడిసినవారై దిక్కులు సూచిరి. (అన్ని దిక్కు లకుఁ బారిపోయిరనుట)

**The Shrine of Vasudevara mentioned in the inscription of Thousand Pillared Temple**




వేయిస్తంభాలగుడి
శాసనములోఁ జెప్పఁబడిన వాసుదేవర గుడి ద్వారబంధము
ఉత్తరపు వైపు.

వసంతతిలకా

గత్వా జవాత్త్రిచతురాణి పదాని రాజా
సస్యస్య ఖండన మివ ప్రథ మాహుతిం వా
భ్రూభంగవీక్షణ వివర్ధితకోప వహ్ని
య ద్వర్ధమాన నగరీం ప్రథమం జుహోవ _౨౫.

[తూ. వై 9_12ప.]

అర్థము :—(రుద్రదేవ) రాజు, మూఁడు నాలుఁగడుగులు పోయి, గడ్డిపరకను వలె లేదా మొదటిసుద్దను (బలిని) వలెను కనుబొమలు ముడుచుటతోడి చూపులచేత వృద్ధి పొందింపఁబడిన కోపాగ్నియందు వర్ధమాన నగరమను నది యేది కలదో (దానిని) మొదట వ్రేల్చివై చెను.

వసంతతిలకా

య స్యాక్షివీక్షణ భయా చ్చకిత స్స భీమో
దుర్యోధనస్య నృప తే రివ విహ్వలాంగః,
స్వభ్రాతృమాతృవనితాసహిత స్స మగ్ర లక్ష్మీం
విహాయ వన మేవ యయౌ విలజ్జః॥_౨౬॥

[తూ. వై 12_15 ప]

* ఈశ్లోకమునకు శ్లీటువ్రాసిన యర్థమునే గ్రహించినాము, (దుర్యోధనస్య నృపతేరివ) యన్నదానికి పండితులెవరైన యింతకన్న మంచియర్థమున్న చెప్పిన బాగుండును,

అర్థము :—ఎవని (ఏ రుద్రరాజుయొక్క) చూపులవలని భీతియును నుండి చలించిన భీమరాజు, దుర్యోధనుని చూపులవలన (పాండవ)భీముడు వలెనే వశముతప్పిన శరీరము కలవాడు (అయి) సంపూర్ణమైన సంపత్తు నంతయు విడచి తన సోదరులతోను, తల్లితోను, పెండ్లాములతోను, గలిసి యడవికి లేచిపోయెనో. (ముందుశ్లోకముతో అన్వయము)

వసంతతిలకా.

తత్పృష్ఠతోఽను జగామ దదాహ రాజా
చోడోదయస్య నగరీ మగరీయసీం తాం
లంకా మి వామరపురీసదృశీం మృగాక్షీ
శ్రేణీవిలాస లలితా మివ చాంజనేయః॥౨౭॥

[తూ. పై. 15-17]

అర్థము :—రాజు (ఆరుద్రరాజు) ఉదయచోడుని యొక్క గొప్ప దైన పట్టణమును ఆంజనేయు లమరావతి వంటిదియు, విలాసినుల సమూహముయొక్క క్రీడలచే నందమైనదియు నగు లంకాపట్టణమును వలెనే కాల్చివేసి యతనిని వెంటాడెను.

శ్లో. లులావ చ వనం తస్య, దుర్గ మర్గళ విభ్రమం
తడాగ మకరో త్తత్ర, పురమధ్యేఽద్భుతం మహత్॥ ౨౮.

అర్థము :—వెండియు, గడియ్రమానులచే (ప్రతిబంధములచే) భ్రాంతికొలుపు నతనిదుర్గమును వనమును భేదించివైచెను. అక్కడ పట్టణమధ్యమమున నొక గొప్పవింత యొనగూర్చు తటాకమును చేసెను. (కట్టించెను)

కందూరో ‡ దయచోడవంశ విలసత్ క్షీరాబ్ధిగర్భోద్భవ
త్పద్మాకాశ్రయరుద్రదేవ నృపతేః కిం వర్ణ్యతే విక్రమః
క్షుద్రక్షాత్రకులోన్నతి క్షయకృత స్సర్వావనిశ్రీభృతో
రామస్యేవ కుఠారఖండిత రిపువ్రాతస్య పృథ్వీపతేః॥ ౮౯॥
[తూ. వై 18_20 ప.]

అర్థము :—గండ్రగొడ్డలిచే నరకఁబడిన శత్రుసంఘము కల పరశు రామునిది వలెనే, నీచరాజవంశముల యభివృద్ధిని క్షీణింపఁజేసి నట్టియు, సమస్తమైన భూమండలము నందలి లక్ష్మిని భరించినట్టియు, గందూరూదయ చోడుని వంశమందుఁ బ్రకాశించుచున్న పాలసముద్రమునఁ బుట్టిన పద్మా వతికి నాశ్రయభూతుఁడయి నట్టియు శ్రీ రుద్రదేవరాజు యొక్క విక్రమ మేమని వర్ణింపఁబడును.

రంగత్తుంగతురం * గపుంగవ ఖురక్షుణ్ణం జగన్మండలం,
జ్యోత్స్నోల్లాసి సదాతపత్రనికరవ్యాప్తం నభోమండలం,
పూర్ణేందూత్కరచారు చామరచయైర్దిఙ్మండలం సంభృతం
దృష్ట్వా సైన్యవినిర్గమం, నరపతేః ప్రాదుద్రువు ♦ శ్శత్రవః॥
[తూ. వై. ప. 20_22]

‡ 'కందూరు' అను పేరయినప్పు డిక్కడ సంధి తప్పు. ఇది లేఖక ప్రమాదము కానోపును.

* తురంగ అనుచోట జాలిమీద తురగం అని పడినది. పొరపాటు.

♦ ప్రాదుద్రువు అని యున్నట్లు గానవచ్చును.

అర్థము :—చలించుచున్న యెత్తైన యశ్వశ్రేష్ఠముల డెక్కలచేతన లంగఁ ద్రొక్కఁబడిన భూమండలము కలిగినట్టియు, వెన్నెలచే శోభగాం చునట్టియు, ఎల్లప్పుడు గొడుగుల పంక్తులచే నావరింపఁబడిన యాకాశమం డలము కలిగినట్టియు, బూర్ణచంద్రునివలె యతిశయమైన సుందరములగు చామరసమూహములచే నిండిన దిక్కులు గలదియును నగు రుద్రదేవరాజు సైన్యప్రయాణమును జూచి శత్రువులు పలాయితులయిరి.

కాంచీమండల వింధ్యమధ్యనిలయా భీమాదయః పార్థివా
యస్య శ్రోత్రపథం గతా అహరహ శ్శ్రీ రుద్రదేవస్య తే,
దృష్ట్వై*వానిమిషాభభూవు రమరీ వర్గాస్సమర్త్యాశ్చిరం,
ప్రత్యావృత్యతమేవ రుద్రనృపతిం ప్రాప్తాశ్శరణ్యార్థినః॥
[తూ. సై. 22—25 ప.]

అర్థము :—కాంచీమండలమునకును, వింధ్యపర్వతమునకును మధ్య ప్రదేశము నివాసము గల భీముడు మొదలయిన రాజులు ప్రతిదిన మే రుద్ర దేవుని చెవిమార్గమున బడిన వారయిరో (ఏరాజులగూర్చి రుద్రదేవుఁడు వినుచుండెనో అనుట) వా రా రుద్రదేవుని చూచినంత మాత్రముచేత నే దేవతలయిపోయిరి. దేవతాసమూహములు మర్త్యులతోఁగూడి (యీలోక మునకు) చిరకాలమునకు తిరిగి వచ్చి శరణ్యుల గోరుచున్నవారయి యత నినే (శరణు) పొందిరి.

---

* దృష్ట్వైవా అని సవరించిన సరిగా నుండుననితోచుటచే నట్లొన రించినాము. రాతిమీద ఐత్వపుగుర్తు భాగను (ై) క్రింద లేదు. అప్పుడు దృష్ట్వేవా అని చదువ వలసి వచ్చును.

రుద్రంస్తౌమిన రేశ్వరం బుధశతానేకం శ్రియోభాజనం
కృత్వాయస్యకదాపిచేతసి మదాశంకానసంక్రామతి;
ఏకంశ్రీపురుషోత్తమం కలకలైః కృత్వాశ్రియోభాజనం
వీచీనాంకురుతేఽధునాపివసుధా ముజ్జాగరాం సాగరః॥
[తూ. వై. 25—27 ప.]

అర్థము :—ఏకైశ్వర్యసంపన్నుఁడైన విష్ణువును లక్ష్మీపాత్రునిగాఁ జేసి, అలల యొక్క కలకల ధ్వనులతో ఇప్పటికిని సాగరుఁడు (సముద్రుఁడు) భూమిని మేల్కొన్న దానినిగాఁ జేయుచున్నాడు. (కాని,) వందలకొలది పండితుల ననేకులను నైశ్వర్యసంపన్నులగాఁ జేసియు, ఎవని మనంబునందు నెప్పటికి 'నే నంతపని చేసితి నను' అహంభావము ప్రవేశింపదో ఆ రుద్రభూపతిని స్తోత్రము చేయుచున్నాను.

న్యగ్భూతీకృతరాజహంసనికరః పద్మోన్మేషస్ఫురైకాశ్రయః
శ్రీరుద్రశ్చతురాననోబుధవరానందైకహేతుర్భృశం,
నానాశాస్త్రవిచారణైకచతురో బ్రాహ్మీవిలాసాశ్రయః
కల్యాణ్యప్రగతిః క్షితావిహశతానందస్స్వ*యం• పార్థివః॥
[తూ. వై. 27—30 ప.]

---

N. B:—రుద్రుని అనగా శివునిపరముగాను అర్థము చెప్పవచ్చును.

* నందస్స్వయం అనుచో తాతిమీద ద తరువాత విసర్గములేదు. 'స' క్రింద సొవత్తు లేదు.

• ఈసున్న తాతిమీద 'స్వ' తరువాత పడినది.

అర్థము :—తిరస్కరింపఁబడిన రాజశ్రేష్ఠులు కలవాఁడును (క్రిందుగా జేయఁబడిన రాజహంసలు కలవాఁడును అని బ్రహ్మపరముగా) బ్రహ్మలకు ముఖ్యమైన యాశ్రయమైన వాఁడును, (చతుర్ముఖబ్రహ్మ, కశ్యప ప్రజాపతి మొదలగు నవబ్రహ్మల కాశ్రయుఁడైనవాఁ డనుట ప్రసిద్ధి) శ్రీ రుద్రదేవరాజు పండితశ్రేష్ఠులకు మిక్కిలి ముఖ్యమైన యానందకారణమై చతుర్ముఖ బ్రహ్మయై (శ్రేష్ఠులైన దేవతలకు .....ఆనందకారణమై) అనేక శాస్త్రచర్చలయందు ముఖ్యమైన నైపుణ్యము కలవాడును (బ్రహ్మ కూడ నట్టివాఁడే), వాఙ్మయమునకు సంబంధించిన వినోదములకు (సరస్వతీ యొక్క వేడుకలకు) స్థానమైన వాఁడును, కల్పమంత దీర్ఘకాల మునికి గలవాఁడును నై, యీ లోకమునఁ గేవలము శతానందుఁడే (యయి) బరఁగుచున్నాఁడు.

సత్యాసక్తమనా, నిరస్తనరక క్లేశశ్చ, లక్ష్మ్యాశ్రయః,
పృథ్వీభృ ద్య దనంతభోగనిలయః శశ్వద్ద్విజేంద్ర ప్రియః,
దుష్టారిష్టవిమర్దన, స్సుమనసా మభ్యర్థితార్థప్రదో,
గోత్రప్రోద్ధరణ, స్సుదర్శనకరో, రుద్రస్స్వయం కేశవః॥౩౮.

[తూ. వె. 30–32 ప.]

అర్థము :—సత్యమం దాసక్తిగల మనస్సుగలవాఁడును, (సత్యభామ యందు మక్కువగలవాడని కేశవపరముగా) పోఁగొట్టఁబడిన నరకమందలి బాధలుకలవాడును, (పోఁగొట్టఁబడిన నరకాసురుని బాధలుకలవాడును) సంపత్తునకు స్థానమైనవాడును, (లక్ష్మికి ఆశ్రయభూతుఁడును), రాజుల యొక్క మేరలేని సౌఖ్యమున కునికిపట్టయినవాడునుఁ (భూమిని ధరించు శేషుని పడగలు నిలయముగాఁ గల వాఁడును,) సంతతము బ్రాహ్మణోత్త

ములను నిష్ఠుఁడైన వాఁడును, (గరుత్మంతునికి ప్రియుఁడును), చెడు కష్ట ములను, బోఁగొట్టువాడును (దుర్గార్గుఁడైన అరిష్టరాక్షసుని మర్దించిన వాడును) మంచి మనస్సుగలవారిచే కోరఁబడిన కోరికల నిచ్చువాఁడును (దేవతలచేఁ గోరఁబడిన కోరికలిచ్చువాఁడును) వంశోద్ధారకుఁడును (గోవర్ధనగిరి నెత్తినవాఁడును) మంచి (వారి) దర్శనము చేయువాడును (సుదర్శనము చేతియందు కలవాఁడును) నగు రుద్రదేవుఁడు స్వయముగా విష్ణువే.

మాలినీ వృత్తము

అసమసమర సంగోత్తుం•గ మాతంగకుం*భ
స్థలవిగళి తముక్తాహార భారాభిరామః ;
భవభవభయభఙ్క్తా భామినీ భవ్యనేత్రో
త్పలదలచయ భూష శ్శోభ తే రుద్రదేవః ॥3౫.

[తూ. శై. 33–34 ప.]

అర్థము:—సాటిలేని యుద్ధమందు దగుల్కొనిన యెత్తగు నేనుగుల కుంభస్థలములనుండి జారుచున్న ముత్యాలహారముల యొక్క బరువు చేత మనోహరమైన వాఁడును, జన్మమువలనఁ గలుగు భయమును భంగము చేయువాఁడును, స్త్రీలయొక్క శోభాయుక్తమైన కన్నులనెడి యుత్పలములయొక్క రేకల సమూహములే యలంకారముగా గలవాఁడునునగు రుద్రదేవుఁడు శోభగాంచుచున్నాఁడు.

---

•, * కుంభస్థలములందున్న సున్నలు తాళిమీద వ్రాయుట మరచి నాఁడు లేఖకుఁడు.

వసంతతిలకా

అస్మిన్ ప్రశాసతి మహీం భువి రుద్రదేవే
రా*జాభిధా శశిని, నైవ నరోత్తమేషు;
ఈశత్వమిందుతిలకే, న ధనాకులేషు;
తేజస్వితా దినకరే, న చ శాత్రవేషు. ॥౩౬.

[తూ. నై. 34—36 ప.]

అర్థము:—ఈలోకము నందు రుద్రదేవుఁడు భూమినిఁ బాలించుచుండగా రా జను పేరు చంద్రుని యందే; (కాని) మానవోత్తములందు కాదు (వర్తింపదు.) ఈశత్వము శివునియందే (కాని) ధనాధిపతులందు కాదు; తేజస్సు గలిగియుండుట సూర్యునియందే కాని శత్రురాజులందు కాదు.

వసంతతిలకా

కేశగ్రహస్సురత సంగర సంభ్రమేషు;
దండగ్రహోయతిషు, నైవ జనోత్కరేషు;
శాస్త్రే వివాదకథనం, వ్యవహారజ న్నో;
న క్వాపి దుష్టమథనం, మథనంత్వరణ్యామ్ ॥౩౭.

[తూ. నై. 33—38 పం.]

అర్థము:—జుట్టు పట్టుకొనుట రతియుద్ధమందలి తొట్రుపాటులందును; దండము (కఱ్ఱ) పట్టుట యతులయందే. జనసమూహములయందు కాదు. దెబ్బలాటఁగూర్చి చెప్పునది శాస్త్ర చర్చలయందే కాని వ్యవహారములకు సంబంధించి కాదు. దుష్టుల నెప్పుడు మథించు (నవసరము) టలేదు. మథించు టనునది అరణియందు (మాత్రమే.)

* జా కు తలకట్టు దీర్ఘము లేదు, (తాళిపాఠము.)

దానం ప్రైన్యపరాధనావధి, రిపుచ్ఛేదావధి ర్విక్రమ
శ్చాతుర్యంచతురాననావధి, గుణగ్రామ స్త్వసంఖ్యావధిః,
తేజో భాస్కరతాపనావధిః; యశో రాశి స్తు రుద్రస్యాయ
స్త్రైలోక్యక్రమణావధి; ర్నిరవధి ర్ధర్మోమతిశ్శోభ తే॥ ౩౮.
[తూ. నై. 38–40]

అర్థము :—రుద్రదేవ మహారాజు యొక్క దానము (దీనుల) దైన్యము పోగొట్టువరకే; పరాక్రమము శత్రుచ్ఛేదనముగువఱకును. నేర్పు బ్రహ్మ పర్యంతమును. గుణములసమూహము లెక్కపెట్టలేనంతవఱకును. తేజస్సు సూర్యుని కాంతి వ్యాపించునంతవఱకు. కీర్తి యేదయితేకలదో (అది) మూడులోకములు దాటువఱకును; ధర్మబుద్ధి మేరలేనిదయి శోభించు చుండును.

ప్రాప్తాశోఽపి, మహత్త్వోఽపి, మహతా
మేకాశ్రయోఽపి, శ్రియో
జన్మస్థానమపి, ప్రసన్నహృదపి,
త్వం రత్నధామాపిసన్
పీత్వా కుంభసముద్భవేన, జలధే!
క్షార స్సముద్రో యతో
నైవం రుద్రనరేశ్వరోఽయ మమునా
స్పర్ధాం వృథా మాకృథాః॥ ౩౯.
[తూ. నై. ప. 41–43]

అర్థము :—ఓ సముద్రమా! దిక్కులను బొందినదానవైనప్పటికిని గొప్పదానవయినప్పటికిని, గొప్పవారికి ముఖ్యమైన యాశ్రయమైనదానవయినప్పటికిని, సుముఖమైన మనస్సుగలదానవైనప్పటికిని నీవు రత్నముల కాకరమవైనప్పటికిని అగస్త్యునిచే (కుండలోనుండి పుట్టినవానిచే) త్రాగఁబడిన దానవే. ఉప్పుసముద్రమవే. ఈ రుద్రనరేశ్వరుఁడట్లుకాఁడు. అనగా (సముద్రములోగల లోపముగలవాడు కాఁడనుట) ఇతనితో వృథాగా స్పర్ధపెట్టుకొనకుము.

ఔదార్యంసురశాఖినశ్శిఖరిణ స్స్వర్ణాకృతేర్గౌరవం,
ధైర్యందాశరథేర్బలంపురభిదో గాంభీర్యమంభోనిధే
స్సౌందర్యంమకరధ్వజాత్సురగురో ర్విద్యారతింకౌతుకా
దాదాయాబ్జసముద్భవేనరచితం శ్రీరుద్రదేవోధ్రువం॥౮౦
[తూ. వై. ప. 43—46]

అర్థము :—కల్పవృక్షమునుండి యుదార స్వభావమును, బంగారు రూపముగల పర్వతమునుండి (మేరువునుండియనుట) గురుత్వమును, రామునినుండి ధైర్యమును, ఇంద్రునినుండి బలమును, సముద్రమునుండి గాంభీర్యమును, మన్మధునినుండి యందమును, దేవతలగురువువలన (బృహస్పతినుండి) విద్యాసక్తియును, కోరికయుండుటవలన (కోరికతో) దెచ్చి పద్మసంభవుడు (నిచే రుద్రదేవుఁడు చేయబడుట) రుద్రదేవుని సృష్టించుట నిశ్చయము.

స్ఫాయత్కైరవ, తీ*ందురంబుజపతి స్స్పష్టాంబుజత్యంబరం లోలంనీలసరోజతి, స్ఫుటయశో దుగ్ధోదధేసంప్రతి, [య జ్యోతీంపిస్ఫుటబుద్బుదంతి, హరితః కూలంతి, లోకాత్ర శ్చంచద్వీచిచయంతియస్యజయతి శ్రీరుద్రదేవోఽద్భుతం॥
॥ ४೧ ॥ [తూ. వై. 46—48 ప.]

అర్థము :—ఎవని స్పష్టమైన యశస్సనెడి సముద్ర మీ దిప్పుడు చంద్రుడు ప్రకాశించుచున్న కలువపువ్వగుచున్నాడో, సూర్యుడు పద్మమగుచున్నాడో ఆకాశము చలించుచున్న నల్లతామరయగుచున్నదో, నక్షత్రములు బాగుగా నేర్పడిన బుడగలగుచున్నవో, దిక్కులొడ్డులగుచున్నవో, మూడు లోకములు కదలుచున్న యలలగుచున్నవో, ఆరుద్రదేవుడద్భుతముగా జయముగాంచుచున్నాడు.

పాదన్యాస శిలా శ్మిరాంసి సమరే
కృత్తాని ఖడ్గేన య
చ్ఛత్రూణాం పతితాని మాంసవిలస
త్వం కేఽథశం కేహ్యాహం;
రక్తస్రోతసి రుద్రదేవజయినో
నృత్యత్కబంధాఃప్లవా
ఆయాంత్యా విజయశ్రియ శ్చ సవిధం
కీర్తేః ప్రయాంత్యాదిశః॥ ४೨.
[తూ. వై 49-51 ప.]

* కైరవతి=కైరవమివాచరతి
సూ : ఆచారార్థమందు క్విప్.

అర్థము :—జయశాలియైన రుద్రదేవుని సమీపమునకు వచ్చుచున్నట్టియు దిక్కులకుఁ బోవుచున్నట్టియు విజయలక్ష్మి యొక్క కీర్తికి, యుద్ధమందుఁ గత్తితో నరకఁబడి, మాంసముతోడ నొప్పుచున్న బుఱదయందు రాలిపడిన తలలు పాదము లుంచుకొనెడి రాళ్లుగాను (దాటి మెట్లనుట), అటు పిమ్మట రక్తప్రవాహములందు నాట్యము చేయుచున్న (తేలియాడుచున్న) మొండెములు పడవలుగాను, నే నూహించుచున్నాను.

తస్యాస్తేఽనుమకొండ మనామనగరీ శ్రీరాజధానీవ యా
యత్రోద్యత్సదఖండ ఖండపరశు* వ్యాజృంభణోజ్జృంభితా
కందర్పస్యపురీవ సా రతిమతీ శృంగారభావాన్వితా
మాహేంద్రీవచజిష్ణు, విష్ణుసహితా రంభావిలాసోర్జితా. ౪౩

[తూ. నై 61_64 ప.]

అర్థము :—కుబేరుని పట్టణమువలె నెచ్చోట విక్రమించుచు, బెద్దముక్కలుగాఁ జేయు నెకని గండ్రగొడ్డలి యొక్క వ్యాప్తిచే నేది ప్రకాశించుచున్నదో (ఎవనిపట్టణము సంపూర్ణుఁడైన శివునియొక్క తాండవముతో బ్రకాశించుచున్నదో అని యర్థాంతరము), మన్మథుని పట్టణమువలె శృంగారభావములతోఁ గూడియున్నదై, సుఖము ననుభవించుచున్నదియో (రతీదేవి కలదో), ఇంద్రుని పట్టణమువలె జయకాంక్షగల జయశీలియైన భూవిభునితో గూడియున్నదో (ఇంద్రోపేంద్రులతోఁ గూడికొన్నదో), అరఁటిచెట్లనెడు వేడుక వస్తువులతో బ్రకాశించుచున్నదియో (రంభయొక్క వేడుకలతో నొప్పుచున్నదో) ఆ యనుమకొండ పట్టణమతనికి (రుద్రదేవునికి) గలదు (రాజధానిగా).

---

* 'ఖండపరశు' అనగా శివుఁడని యర్థము కలదు.

వసంతతిలకా

యత్ర స్త్రియో మకరకేతన రాజధాన్య
ఆనీలనీరజపలాశదృశః కృశాంగ్యః;
త్రైలోక్యసుందర దృశాం తిలకాయమానా
ఆపీనతుంగ కుచకుంభ భరాలసాంగ్యః॥ ౪౪.

[తూ. వై. 54—50 ప.]

అర్థము :—ఎచ్చోట స్త్రీలు మన్మధుని ముఖ్యపట్టణములో, అంతటను నల్లనైన నల్లకలువ పత్రములవంటి చూపులుగలవారలో, సన్నని నడుము కలవారలో, మూడు లోకములయొక్క చక్కని చూపులుగలవారలకు (సౌందర్యవతులకు) చుక్క బొట్టువంటి వారలో బాగుగా బలిసినవియు నెత్తైనవియునగు స్తనములనెడి కుండలయొక్క బరువులచే సుక్కిన యవయవములుగల వారలో.

వసంతతిలకా

యత్రద్విజేంద్రభవనేషు నివార్యమాణాః
కీరాః పఠంతి పటవో వటుభి స్సమేతాః
సర్వాంగసంగత సమస్తవిచార చారు
చారిత్రచర్చిత పదక్రమయుక్తవేదాన్॥ ౪౫.

[తూ. వై. 56—58 ప.]

అర్థము :—ఎచ్చోట బ్రాహ్మణశ్రేష్ఠుల యిండ్లయందు, నివారింపబడినప్పటికిని జాణలైన చిలుకలు బ్రహ్మచారులతోఁగూడి, షడంగలముతో గలిసియున్న సమస్త చింతనలవలన సొంపైన యితిహాసములతో జర్చింపబడిన పదము, క్రమము మొదలగు వేదములను జదువుచున్నవో (ఆయనుమకొండ యతనిక రాజధానియని యన్వయము.)

వసంతతిలకా

వేశ్యాగృహేషు సురతోత్సవ జాతజేష్టా
శబ్దానుకారి శుకశాబకలోరుశబ్దాః,
సర్వాదిశో ముఖరయంతి దివావిటానాం
కందర్పదర్ప తరలార్ణవ పూర్ణచంద్రాః ॥౮౯.

[తూ. సై. 58–60 ప.]

అర్థము :—వేశ్యల యిండ్లయందు విటుల సురతక్రీడలందు బుట్టిన చేష్టలయొక్క ధ్వనుల ననుకరించు చిలుక పిల్లలయొక్క కలకల మనెడి గొప్పధ్వనులు, పగటియందు గందర్ప దర్పమనెడి చలించుచున్న సముద్రమునకు బూర్ణచంద్రులు కలవై సమస్తదిక్కులను ధ్వనింపఁ జేయుచున్నవి. (రాత్రులు విటులు మాట్లాడు మాటలు, పగలు చిలుకపిల్ల లుచ్చరించుటచే మన్మథ వికారమున కంతట నుద్దీపన కారణములగుచున్నవని తాత్పర్యము.)

నాతిక్రామతి వైష్ణవంపదమితి ద్యాం గౌ రితి క్ష్మామిమాం
పాదైస్స్పృక్ష్యతి నో తురంగమచయశ్శ్రీరుద్రదేవస్యయః*;
సర్వాశాఃపరిపూరయ న్విజయతే నృత్యేన సంభీషయం
చ్ఛ•త్రూన్యుద్ధమహీతలే ప్రతిదినంవిద్రావయన్మారయన్

[తూ. సై. 60–61 ఉ. సై. 1–3 ప.]

అర్థము :—శ్రీరుద్రదేవ నరపతియొక్క యే గుఱ్ఱములగుంపు, విష్ణుపాదమని యాకాశమును దాటదో, గోవని భూమిని పాదములతో

---

* ఇక్కడను తూర్పువైపు 61 వ పంక్తితోఁ బూర్తియైనది.
• శ్ఛత్రూన్—అని డాక్టరు ఫ్లీటు సవరించినాఁడు.

ష్పృశింపదోయది (అసఖ్యాకుల సమూహము) అన్నిదిక్కులను వ్యాపించుచు యుద్ధభూమియందు బ్రతికిన కు శత్రువులను నాట్యముచేత క్షయపెట్టుచును, జంపుచును, జయముగాంచుచున్నది.

మాలిని

అతిరమణశరీరా యే చ నీచస్వరాఢ్యా
స్సకలతురగ శాస్త్రోద్భాసి సల్లక్షణాఢ్యాః;
జవభరభరితాంగా స్సత్వసంపన్నగాత్రా
అతిచిరతరజీవాః పంచధారా స్తురంగాః॥ ౪౮.

[ఉ. వై. 4—6 ప.]

అర్థము :—ఏవిమిక్కిలి యందమైన శరీరములుగలవియో, సన్నని కంఠస్వరముతో గూడికొన్నవియో, సమస్తాశ్వశాస్త్రలక్షణములకుఁ దగు సులక్షణములతో గూడి యున్నవో, వేగభారమును వహించిన యవయవములుగలవియో, బలసమృద్ధిగల శరీరములుగలవియో, మిక్కిలి చాల కాలమువరకుండు జీవనముకలవియో. (యవి) పంచధారలనెడి యశ్వవిశేషములు (అయియున్నవి.)

మందాక్రాంతా

రాజ్యం ప్రాజ్యం*లవణజలధే స్తీరపర్యన్తమస్య
శ్రీశైలాంతాం ప్రచరతిసదా దక్షిణాశాం సమగ్రాం
ప్రాతీచ్యాన్తా కటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాశాతటవిలసితే మాల్యవన్తం ప్రదేశే॥౪౯.

[ఉ. వై. 7—11 ప.]

---

* 'ప్రాజ్యం' అని తాటిమీద స్పష్టముగానున్నది. 'ప్రాచ్యాం' అనియుండిన బాగుండును. లేఖక ప్రమాదమేమైన జరిగియుండునా? ప్రాజ్యం' అన్నను నర్థములో దోషముండదు.

అర్థము :—ఇతని గొప్పదైన రాజ్యము, సముద్రపు టొడ్డువరకును, శ్రీశైల పర్వతమంతమందుగల దక్షిణదిక్కు నంతటిని (కిని) ఎల్లప్పుడు వ్యాపించుచున్నది. (ఇతని) రాజ్యలక్ష్మి పడమటి దిక్కు మేరగాఁగల (కళ్యాణ) కటకము సమీపమున నిలిచియుండునదియై, యుత్తరపు దిక్కు నొడ్డునందున్న భాగమందు మాల్యవంతము వఱకు సంచరించుచున్నది.

రథోద్ధతా

అర్చనార్థ మిహాద త్తవాన్మహా
న్మద్దిచెలువుల నామఖేటకం,
శ్రీమహేశ రవిశౌరిణాస్థిరం
రుద్రదేవ నృపతి ర్మతే స్సతాం॥ ౫౦.

[ఉ. వై. 11–12 ప.]

అర్థము :—ఈలోకమున సజ్జనుల కిష్టుఁడైన రుద్రభూపతి శ్రీమహేశ్వరుడు, సూర్యుడు, విష్ణువు ఉండు నంత కాలము స్థిరముగా (నుండు నట్లు) మద్ది చెలువులయను పేరుగల గ్రామమును పూజకొఱకు దానము చేసికొన్న వాఁడాయెను.

సంపూర్ణము.



The eastern shrine of Soorya Devara Thousand Pillared Temple.




వేయి స్తంభాలగుడి

శాసనములోఁ జేర్కొనఁబడిన సూర్యదేవర గుడిద్వార బంధము

# వేయిస్తంభాల గుడి శాసనము

## అనుబంధము

౧

మాడిరెడ్డి కొంటశాసనము (చూ:-వే. గు. శా. పుట 19)

1. రడ్డికుంటభక్త్యా * ... ...
2. ధమ్మ్రా (ర్మా) ప్రతిపాలనార్థా (ర్థా) ం [॥] యో రా
3. మె (మే) శ్వరపండి తో (తో౽) య మితి దిగ్వ్యా
4. ప్తా (ప్తో) యశః (శ) శ్చంద్రికౌజాలైర్యో్యా (ర్యో) గు
5. ణరత్నరోహణగిరి మ్మా్ర (ర్మా) హె (హే) శ్వర
6. గ్రామణీః ఎ (ఏ) తె (తే) షాం సురసద్మనా చ
7. కృతవాన్ పుంజం ఘృణా తత్పరో [।]
8. దాతాన్నం వికలార్త్రా (ర్తా) దీనముని
9. విప్రె (ప్రే) భ్య స్తపా (పో) విశ్రుతః॥ కృత్వా నై
10. జనపల్యాః శివపురనామ స్త్రీపు
11. రుషతి (తీ) ర్థా (ర్థా) స్య [।] దత్తం యస్య భక్త్యాత్రి
12. భువనమల్లావని (నీ) శజనకె (కే) ః॥ వె (వే)
13. త్తా యో లకులె (లే) శ్వరాగమమహా
14. సిద్ధాన్తసారామృతం [।] యె (యే) నాస్యాః ప్ర
15. కటి (టీ) కృతో (తో) వసుమతౌ ధమ్మ్రా (ర్మా) శ్చ
16. తస్యా (స్యో) త్తమః [।] శిష్యా (ష్యో౽) సౌ చలమ
17. ర్త్రా (ర్తా) గంణ్డనృపతిః ప్రా (ప్రో) లావని (నీ) వ
18. ల్లభః [।] స్తంభం స్థాపితవాన్
19. స్వ కి (కీ) ర్త్రా (ర్తా) విమల స్తంభాయితం

* ఇటుతరువాత, ఱాయి ఏటవాలుగా విఱిగిపోయినందున అక్షరములు పోయినవి.

20. శాశ్వతం॥ స్వదత్తాం పరదత్తాం
21. వా యో హర (రే) త వసుంధరాం
22. షష్టిర్వ్వ (ర్వ) షా (షా) సహస్రాణి వి
23. ష్ఠాయాం జాయతె (తే) కృ (కృ) మిః॥ శ్రీ
24. పిడిచె (చే) టిప్రభుణా గణ
25. పతిరాజపుత్రె (త్రే) ణ ప్రొ (ప్రో) ల
26. మరాజేన లిఖితం॥

షరా :—ఈ శాసనములోని విషయములు శ్రీ రామేశ్వరదీక్షితునికి సంబంధించినవి కలవు. చరిత్రపరిశోధకులు గమనింపఁదగినవియు నపూర్వ ములును గూడ నయియున్నవి. [కం॥ అ॥ శా॥]

## ౨

## ఖాజీపేట దర్గా శాసనము (చూ. అనుక్రమణిక)

### తూర్పు

1. సామన్తవిష్టివశః శ్రీ (శ్రీ) మా న్కాకతిపు
2. రాధినాధొ (ధో) బె (బే) తః [।] చొ (చో) ళత్మ్మాపా
3. ళచమూవార్ధి (ర్ధి) బ్రమథనసమాజ్ఞి (జ్ఞి)
4. తొ (తో) జ్జ (?) తలక్ష్మి (క్ష్మీ)ః॥ పుత్ర (త్రి) స్తస్య జగత్ప
5. విత్రచరితః ప్రొ (ప్రో) లక్ష్మాపాల
6. కొ (కో) [।] నిర్వ్వ (ర్వ) క్రి (క్రీ) కృతచక్రకూట విష
7. యో భద్రంగవిద్రావణః [।] జిత్వా
8. కొంకణమణ్ణ్లొ (లో) నిజయశశ (శ్య) ం
9. వా (పా) లితాశః [।] పరాద్ధ్యా (?) త్సాయ్యా (యా) య్యా
(య్య)
10. జనస్తుత్యసవిసరత్కీ (త్కీ) ర్తి (ర్తి) [ః] సమావర్త్త (ర్త)

11. యత్ । స ఎ (ఏ, వ ॥ జిత్వా హా న్తర * *¶
12. యాన్ పృథువనా కొడ్వత్తి
13. దుర్గాత్మజం [।] హత్వాజౌ గుణసాగరస్య
14. పురకూదె (దే) శం చ గొన్నాహ్వాయం [।] తత్తి
15. ద్భూయుత మన్మకొండ విషయ [ం] * †
16. శొ (శో) క్యమల్లక్ష్మా ధి (ధీ) శా చ్చాస
17. నబద్ధ ముద్ధత జయి (యీ) సంలబ్ధవా
18. న్యాశ్వతః ॥ సూ (శూ) ను రస్య పరశూ పద
19. వా న్ని (?) శ్చొ (శ్చో) శమాళవమదె (దే) భమ్మ
20. గా (గే) శ (శ) ః [।] విక్రమె (మే) ణ భువి విక్ర
21. మచక్రి (క్రీ) [।] బె (బే) తభూపతి రితి (ర
22. థితొ (తోఽ) భూత్ ॥ అన్మకొణ్డాపురి (రీ) వా
23. టి (టీ) ం తి (తీ) ర్థగ (ర్థగ) ం శివపురాహ్వాయం [।]
24 తత్ర స్వ నామ్నా సౌ దె (దే) వాలయ మ
25. చి (చీ) కరొ (రో) త్ ॥ * * * * *

షరా:—ఈ శాసన ప్రతిబింబము ధనమిచ్చి తెప్పించుకొనిన హైద్రాబాదు ఆంధ్రపరిశోధక సంఘము వారివద్దనుండగా జూచి వ్రాసికొంటిని. కాని అది వ్రాసికొనినప్పుడు, ఈ గ్రంథమున కనుబంధముగా ప్రకటించెదమను నుద్దేశ్యము లేనందున ఇతరత్ర ప్రకటించిన దానికన్న మేలుతరముగా నుండునట్లు వేయుటకు దగిన జాగ్రత్తి పుచ్చుకొనలేదు. [పరిష్కర్త, వే. గు. శా.]

---

¶ ఇక్కడ రెండక్షరములు విచిత్రముగా వ్రాయబడినవి. ఇతరులు 'మన్వా' అని చదివిరి.

† ఇక్కడక్షరము 'త్తై' వలె గానవచ్చినది. కాని 'త్రైలోక్యమల్ల' అని శ్రీయుత మారేమండ రామారావుగారు B. A. (honrs) M.R.A.S. (చూ. ఆంధ్రేతిహాస సంఘపత్రిక. సంపు. 8 సంచిక 1.)

## 3

## గూడూరి శాసనము

శ్రీ

చ. అనుపమదుర్జయాన్వయసు ♦ ధాబ్ధిన నేకులు రాజనందనుల్
సనిసబిఱంద వెన్నఁడును ♦ సంభవుఁడయ్యె నతిప్రసిద్ధుఁడై
వినుతివిరోధి మండళిక ♦ వెన్నఁడు వెన్నుఁడపోలె ; వానికిన్
ఘనుఁడగు నెఱ్ఱభూపతి ♦ జగద్వినుతుండుదయించెఁగీర్తితోన్

చ. భావితకీర్తి నాతనికి పాండవ ♦ మధ్యమ భీముఁడోయనం
గావిరిమాలభీమనృపు ♦ ఘన్మగుఁడై యుదయించె; వానికిన్
భూవినుతుండు, మండలిక ♦ భూషణుఁడెఱ్ఱ నరేంద్రుఁడుత్తము
శ్రీవినుతుండు, బంధుజన ♦ సేవ్యుఁడుదా నుదయించెనున్నతిన్

చ. అతఁడని బొట్టబేత వసు ♦ ధాధిపుఁ జేకొని వానివైరిను
ధ్రితమునఁ జంపి, యాకొఱవి ♦ దేశమునందుఁ బ్రతిష్ఠసేసి, త
త్తనయున మేతుఁడో[డగని-◡]యుము బిట్టఱగద్యనంబు?నఁ
ప్రతిముఁడు వానిదా మొగుడు ♦ పర్సియు పండ్రఁడు నెఱ్ఱఁడా
డాపుత్రుఁడై.

చ. అరుదగునట్టి యెఱ్ఱనృపు ♦ నంగన గామ*సా(మ)ని యాకమే
ల్గరదని (?) బేతభూవిభునిఁ ♦ గాకతివల్లభుఁ జేసి వానిఁదాఁ
బరగఁగఁ జేతఁబెట్టి ఘనుఁ ♦ బల్లవరాయని యాగిజొచ్చె భా
స్కరవిభుచక్రవర్తిఁగని ♦ కాకతి నిల్పుట కోటి సేయదే.

---

* లఘ్వక్షర మొకటి తక్కువపడినది. దానిని పూర్తిచేసితిని (కం.ఆ.శా.)

ఉ. కారక (?) కాలుఁడై పడుసెగాడ (ట) యనాయకుఁ జంపిసూ
రఁడ

న్వేలుపుగొండ [ ] ర్యనృపు ♦ వేలుపుగొండననిల్పి వానిచే
మేలుగ మూడుముప్పయిని(?)మేలుగనేరెడు బోదిపాడునుం
మేలుగ టేకుమావిడులు ♦ మేలుగరెండయ(?)రాజుసంగఁడై

* * * * *
* * * * *

[ఈ శాసనము ప్రకటింపఁ బడని తెలంగాణా శాసనముల ప్రతులలో నిది ఒక మిత్రుని యొద్ద నుండి శాసనశిలమీది వరుసకు సంఖ్యలు వేసి వ్రాసికొనియున్న దానిని నిచ్చట పద్యపాదముల క్రింద విభాగము చేసి, కొన్ని మార్పులతో నిచ్చినాను. ఇది ప్రతిబింబముతో వేయఁదగిన తెనుఁగు పద్యగద్యయుతంబైన శాసనము. అప్పటి తెనుఁగు భాషయొక్క వైఖరి గొంత తెలిసికొన వీలగును. ప్రస్తుతమింతకంటె మంచిస్థితిలో దీనిని బ్రకటింపఁజాలక పోవుచున్నాను. (కం. అ. శా.)

౪

గణపేశ్వరశాసనము. [Epig. Indica. Vol. III.]

శ్లో. అస్త్యూర్జితాం కాకతి వంశజానాం
నరేశ్వరాణాం కులరాజధానా
ఆంధ్రావనీమండల మన్మకొండ
నామాభిరామం నగరం ధరిత్ర్యాం ౧

శ్లో. తత్ర స్థితః ప్రోలధరాధినాథః
స్వబాహు నిర్యాణధరాంవరక్షు (?)
యస్యప్రతాపోజ్వలనే సమంతా
చ్ఛత్రుక్షితీశాశ్చలభా బభూవుః ౨

శ్లో. కేచిత్తైలపదేవవత్ గజహయం యుద్ధాజిరేత్త్యాజితాః
కేచిత్ దూరమపోహితాః సమరతో గోవింద దండేశవత్
కేచిత్ స్వస్యపదేషు యేననిహితో చోడోదయక్ష్మేశవత్
* * * * * ౩

శ్లో. తస్మాన్నోప్పిలన్రు పేశ్వరా
న్మప్పల (మ) దేవ్యాం బభూవతుః,
పుత్రౌ రిపున్రుపమదేభ సింహౌ
రుద్ర మహాదేవ భూపతీ ఖ్యాతౌ ౪

శ్లో. ఉన్మృష్టాణి పురాణి యేన కథయం త్యాపూర్వత త్తజ్జనైః
తత్తన్నామభి రోరుగల్లునగరే నిర్మాపితా వాటికాః
కించస్వేషు కృతేషు తేష్వథ పురేష్వాపూర్వనూత్నైః జనైః
శ్రీరుద్రేశ్వరసంజ్ఞయా విరచితాః ప్రఖ్యాత దేవాలయాః ౫

[షరా:—ఈ శాసనము మ. రా. శ్రీ మారేమండ రామారావుగారి దగ్గరనుండగా వారుచదువగా నేనువ్రాసికొంటిని. అనుబంధముకొఱకు శాసనములకై వెదకుచుండగా నిది కనఁబడినది. వేయి స్తంభాలగుడిలోని యంశములను స్థిరపరచు కొన్నివిషయము లుండుటంబట్టి దీని ప్రాముఖ్యత గమనింపఁదగినది. అయినను మూఁడవశ్లోకములోని నాల్గవపాదము నేను వ్రాసికొను

వే. గు. శా.

**The supposed head of Pratap Rudra lying in the Sambhuni Gudi, Warangal Fort**



ఓరుగంటి కోటలోని శంభునిగుడి యం దున్న
ప్రతాపరుద్రుని శిరస్సు

టలోఁ గాఁ బోలు మఱచుటచే దానినిఁ బూర్తిచేయ నాకు వీలుచిక్కినది కాదు. ఆ నాల్గవపాదమున ప్రోలరాజు మంథెన్న గుండరాజును చంపిన విషయము ఎత్తికొని యుండునని నేనూహించుచున్నాను. అచ్చుతొంద అలో నీ శాసనశ్లోకములను సరియగు పాఠముతో నీయలేక పోవుచున్నాను.

[కం. అ. శా.]



# వే. గు. శా. అనుక్రమణిక.

## అ



## ఆ

# వే. గు. శా. అనుక్రమణిక

## గ



## ఠ

## ఛ



## జ



## ఞ



## ట



## డ



## ణ



## త

## ద

# న



# ప

# ప

## న

# ప

## బ



## భ

## మ

## య



## ర

## ల



## వ

## శ

# వే. గు. శా. అనుక్రమణిక



## స

## హ



షరా: అనుక్రమణికలోని శ్లోకములసంఖ్య అనగా 'మూలము అనువాదము' అను శీర్షికక్రింద నున్న శ్లోకములసంఖ్య యని భావింపవలయును. etc.

# శుద్ధపత్రము



| పుట. | తప్పు. | ఒప్పు. | పఙ్క్తి |
|---|---|---|---|
| 3 | బెంగాల్ ఏషియాటిక్ జర్నలులో | బెంగాలు ఏషియాటిక్ సొసైటి జర్నలులో | 5, 6 |
| ,, | బెంగాలురోయల్ | బొంబయి బ్రాంచి రోయల్ | 7 |
| 8 | అనుష్ఠుభ్ | అనుష్టుభ్ | 15, 16 |
| 9 | క్రీ. శ. 1162 | క్రీ. శ. 1163 | 2 |
| 11 | అట్టికవిత్వ సంపద. | అట్టి కవిత్వసంపద | 8 |
| ,, | వెయ్యి స్తంభాలగుడి | వేయి స్తంభాలగుడి | 21 |
| 12 | పండితుఁ డన్నాఁడట | పండితుఁడన్నాఁడఁట | 10 |
| ,, | శ్రీయుత కృష్ణశాస్త్రిగారు | శ్రీయుత రా.బ. హెచ్. కృష్ణశాస్త్రిగారు | 15 |
| 13 | బెంగాలు ఏషియాటిక్ రోయల్ సొసైటిలో | బొంబయి బ్రాంచి రోయల్ ఏషియాటిక్ సొసైటి జర్నలులో | 1 |
| 13 | వే. గు. శా. పీఠిక | వే. గు. శా. ఉపక్రమణిక | 9 |
| 13 | అట | అఁట | |
| | చదివిరట | చదివిరఁట | 22 |
| | తెలిపిరట | తెలిపిరఁట | 61 |
| | చున్నారట | చున్నారఁట | 15 |
| 18 | దంతామాతికాంతాశ్రయ | దంతామాతికాంత్యాశ్రయ | 25 |
| 19 | చారిత్రక స్త్రీపురుషులు | చారిత్రిక స్త్రీపురుషులు | 1 |
| 20 | విధవత్వము | విధవాత్వము | 10 |
| 23 | వెయ్యి స్తంభాల | వేయి స్తంభాల | పఙ్క్తి |
| 23 | | * స్టారుమార్కు ఇదివరకున్న పఙ్క్తికి తరువాతి పఙ్క్తిలో శా. శ. ౧౦౩౭ తరువాతనున్నట్లు పాఠకులు తలపవలెను. | |

| | | | |
|---|---|---|---|
| 23 | బ్రశంస | ప్రశంస | 24 |
| 24 | జలంధేశ్వర | జలంధరేశ్వర | 22 |
| 25 | వలసియున్నను | వలసియున్నది అని మార్చుకొనవలెను. దీని తరువాత 'పేరా' చివరవఱకున్న వాక్యములు వదలివేయవలెను. దీనికి సంబంధించిన ఫుట్ నోటును గూడ వదలివేయఁదగు. | ,, |
| 26 | No. 1005 | No. 1095 | ft. note |
| 28 | కృష్ణశాస్త్రి (బి.ఎ.) గారు | శ్రీయుత రా. బ. హెచ్. కృష్ణశాస్త్రి బి. ఏ. గారు, ఇట్లు వీరిపేరు వచ్చినప్పుడెల్ల సవరించుకొనవలె. | 16 |
| 29 | మంధన్యగుండాధిపు...... | మంథన్యగుండాధిపు...— | 13 |
| 35 | Ref. List of Antiquaries | Ref. List of Antiquities. | ft. Note |
| 34-35 | | 'కాని ఇంతకుముందు ........ రుద్రదేవుఁడు రాజ్యమునకు వచ్చినట్లు నిర్ణయింపవలసియుండును' అను మాటలు పూర్తిగా విడిచిపెట్టవలెను. 34 పుటలో 27 పఙ్క్తినుండి 35 వ పుట 2 వ పఙ్క్తి వఱకు | |
| 39 | శా. శ. ౧౧౪౧ అనగా క్రీ. శ. 1219-20. | శా. శ. ౧౦౪౧ అనగా క్రీ. శ. 1119-20 | 23 |
| 42 | | రుద్రుని భార్య అన్నమదేవుల శాసనము 1148 ఎ. డి. నుఅ వాక్యమును విడిచిపెట్టవలెను. | 15, 16 |
| 42 | దుర్వ్యయశః | దుర్వ్యశః | 32 |
| 42 | వెయ్యిస్తంభాలగుడి | వేయిస్తంభాలగుడి | 23 |

| | | | |
|---|---|---|---|
| 42 | సంపు, ౧-౧ సంచిక | సంపు. ౨-౧వ సంచిక | ft. Note |
| 44 | యాది విభుండిల | యా విభుండిల | పద్యపఙ్క్తి ౧ |
| 45 | ... చరిత్రలనుండి | చరిత్రనుండి | 22 |
| 46 | గ్రంథభాగములను | గ్రంథభాగములను | 10 |
| 48 | వెయ్యి స్తంభాల | వేయి స్తంభాల | 1 |
| ,, | జిత్వాపా నర మన్వయా పృథువనాగొడ్వ ... | జిత్వాపా నరమన్యయాన్పృథువనాకొడ్వరి | శ్లో. ప. ౧ |
| 48 | శాశ్వతిః | శాశ్వతం | శ్లో. 4 వ పఙ్క్తి. |
| ,, | దొరికినది | దొరకినది | 20 |
| ,, | పోలరాజు | ప్రోలరాజు | 21 |
| 50 | పేరున | పేర | 24 |
| 52 | వెయ్యిమంది | వేయిమంది | 17 |
| 54 | మల్లికారునుఁడే | మల్లికార్జునుఁడే | 54 |
| | సిద్ధాద్రి | సిద్ధాద్రి | 26 |
| 59 | కృషానది | కృష్ణానది | 8 |
| 61 | | మద్దిచెఱువుల గ్రామమనుటకు బదులుగా శ్రీశైలమని శీర్షికను చదువవలెను. | |
| 61 | అప్పుర్ | అప్పూర్ | చివరపఙ్క్తి. |
| 62 | నేమారెడ్డి | వేమారెడ్డి | 8 |
| 66 | | 'త్ర' అని చదువవలెను. అని రెండుసార్లు పడినది. మొదటిపఙ్క్తిలోనిది విడిచివేయవలెను. | ft. Note |
| 66 | సా (సో౯) | సా (సో౨) | శా. ప. 18 |
| ,, | (పి) | (ప్రీ) | శా. ప. 13 |
| 67 | దడా [1] | ఈ బ్రాకెట్లు, దీనిలోని నిలువుగీత ... ప. 33 లోని లీలయా ... తరువాతఁ జేర్పవలెను. | శా.ప.32 |

| | | | |
|---|---|---|---|
| ,, | యుద్ధబబంధ | యుద్ధ (ద్ధే) బబంధ | శా. ప. 28 |
| 69 | వర (ర) | వర (రే) | శా. ప. 22-63 |
| ,, | శ్రిగిరి శ (శే) | శ్రి (శ్రీ) గి etc. | శా. ప. 7_48 |
| ,, | ఉనత్తా | ఉన్మత్తా | శా. ప. 27_68 |
| 70 | క్షితిలతల etc. | క్షితితల etc. | శా. ప. 36_77 |
| 72 | జగన్మండలం | జగన్మండలం [।] | శా. ప. 20_109 |
| ,, | నగరి (రి) | నగరి (రీ) | శా. ప. 16_105 |
| ,, | వసంతస్య | వసంతస్వ | శా. ప. 17_106 |
| 73 | య (ం) | య [ం] | శా. ప. 30_119 |
| 74 | పృధ్వి (ధ్వీ) | పృథ్వి (థ్వీ) | శా. ప. 31_120 |
| ,, | శశ్వద్వి (ద్వి) | శశ్వద్వి (ద్వి) | ,, |
| ,, | కు (ం) | కు [ం] | శా. ప. 33_122 |
| ,, | తె (తే) | తె (తే) | శా. ప. 36_125 |
| 75 | స్పర్ధా (ధా ?) | స్పర్ధా (ధా) ం | శా. ప. 43_132 |
| ,, | మాకృధాః | మాకృథాః | శా. ప. 43_132 |
| ,, | ఔదార్యా | ఔదార్యా | శా. ప. ,, |
| ,, | దైర్యా | ధైర్యా | శా. ప. 44_133 |
| ,, | [శా] (ః) | [శా]. తప్పులోగల బ్రాకెట్టు, పైపఙ్క్తి లోని 'రచితం' తరువాతి స్టారు మార్కు తరువాత నుండవలసినది క్రిందికి జరుపబడినది పైకి తెచ్చుకొనవలెను. | శా: ప. 46_135 |
| 76 | ద్య * దఖండ | ద్య * ద్యదఖండ | శా. ప. 52_141 |
| ,, | గృహే (హే)షుజానుర etc. | గృహే(హే)షునుర etc. | శా. ప. 58_147 |
| ,, | జాతిచె (చె) | జాతచె (చే) | ,, |
| 77 | యం [।] చ్ఛత్రూ etc. | యం [।] చ్ఛత్రూ etc. | శా. ప. 2_152 |

| | | | |
|---|---|---|---|
| 78 | ఖేటకం | లనామఖేటకం | శా. ప. 15_164 |
| 88 | దస్త్రీకుమారే | దస్రౌకుమారా | 14 శ్లో. 3 వ పాదము |
| 90 | కులేనాహీనో | కులే నహీనో | శ్లో. 17 |
| 106 | తస్యైస్త్తేనునుమ కొంచెమనామ etc | తస్యైస్త్తేనుమ కొండనామ etc | 43 శ్లో. 1వ పాదము |
| ,, | (పుటసంఖ్య) 166 | 106 | |
| 107 | [తూ. నై. 54-50 ప.] | [తూ. నై. 54_56 స. | 44 శ్లో. క్రింద |

---

# పూలతోఁట గ్రంథమాలకు

## శాశ్వత చందాదారులు

౧ శ్రీయుత గోవిందరావు దేశపాండ్యాగారు, తహసీల్‌దారుఁడు, నైజాం.

## పోషకులు

౧ మ. రా. శ్రీ రాజారంగరావు బహద్దరుగారు, జాగీర్దారు, గాలీగూడెం. హైద్రాబాదు దక్కన్.

## సహాయకులు

౧ మ.రా. శ్రీ మారేమండ నరసింగరావు పంతులుగారు, రిటైర్డుఅసిస్టెంట్ ఆడిటరు, నైజాం రైల్వే, మకాం :—హనుమకొండ.

౨ బ్రహ్మశ్రీ చావలి వేంకటనర్సింహశాస్త్రిగారు, గుల్బర్గ, నైజాం.

౩ మ. రా. శ్రీ అయితంరాజు కొండలరావుగారు, హెడ్‌మాష్టరు, వనపర్తి.

౪ మ. రా. శ్రీ శ్రీరాం రావుగారు హైకోర్టువకీలు, హనుమకొండ.

౫ మ. రా. శ్రీ జగన్నాథరెడ్డిగారు, పిండిప్రోలుదేశముఖు, మానుకోట తాలూకా, నైజాం.

౬ Mr. N. T. Rajah, కిషనుపురం, హనుమకొండ.

౭ మ. రా. శ్రీ నాయని రంగారెడ్డిగారు, సిరిపోలుదేశముఖు, నైజాం.

౮ ,, నెల్లుట్ల శేషగిరిరావుగారు, మక్తేదారు, వకీలు, హనుమకొండ.

౯ ,, ఎతిరాజులుగారు, కంట్రాక్టరు, పి. డబ్ల్యూ. డి. కరీంనగర్.

౧౦ Mr. Nallaballi, Supervisor P. W. D. నైజాం.

౧౧ ,, పామలపర్తి సదాశివరావుగారు, దేశముఖుదేవునూరు, వరంగల్ త॥

A brief note on the following historical persons and places mentioned in this inscription is to be found on pp. 19-62.

*Historical persons*

1. Rameswara Dikshita
2. Achintendra Vara
3. Tribhuvanamalla
4. Prola II
5. Tailapa III
6. Govinda
7. Chododaya
8. Gunda
9. Jagaddeva
10. Rudradeva
11. Domma
12. Meda
13. Mailigi
14. Bhima
15. Gokarna

*Places.*

1. Anumakonda
2. Mantrakuta
3. Vardhamana
4. Kandooru
5. Malyavanta
6. Kataka (Kalyan)
7. Sri Saila
8. Maddicheruvula

*Copies can be had from*
**Editor:**
**'PRABUDDHANDHRA'**
***Innespet*, RAJAHMUNDRY.**

# Genealogy

OF

# The Kakatiyas of Warangal

## ( ORUGALLU )




Printed at the Saraswathi Power Press, Rajahmundry.